# మార్క్సిజం పాఠాలు

## 1

తెలుగు సేత : ఆర్వియార్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**Marxism Paataalu - 1**
Translation from Englih to Telugu from the book
"A Dictionary of Marxist Thought" by R.Venkateswara Rao

రాజకీయ/సామాజిక/ఆర్థికశాస్త్ర గ్రంథాలు

ప్రచురణ నెం. : 20

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబర్, 2004



వెల: రూ. 8-00

ప్రతులకు :విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్ / సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.



ముద్రణ: విశాలాంధ్ర ప్రెస్, హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# ఉద్యమ ప్రస్థానంలో వెలుగుల దీపం

మార్క్సిజం ఒక శాస్త్రం - ఒక శస్త్రం. నిత్యం ఆచరణ గీటురాయిమీద ఈ శస్త్రాన్ని పదును పెట్టుకోవాలి. ప్రపంచ వ్యాప్తంగా భిన్నభిన్న ప్రాంతాలలోని సామాజిక సమస్యలను అధ్యయనం చెయ్యటంలోనూ వాటికి ఆచరణాత్మక పరిష్కార మార్గాలను కనుగొనటంలోనూ ఈ సిద్ధాంతం ఒక శాస్త్రంగా రూపుదిద్దుకుంది. నిత్యం కొత్త ఆలోచనల వెలుగులో ఆచరణల ప్రబోధంతో సృజనాత్మకంగా పరిపుష్టమవుతోంది.

మార్క్సిజం గుడ్డిది కాదు - ఇది ఒక పిడివాదం కాదు. ఆచరణ యోగ్యమైన జీవన సిద్ధాంతం. సమసమాజస్థాపన దిశగా ప్రయాణించే మార్గాన్ని సుగమం చేసే సాధనం. దేశకాల పరిస్థితులను గమనంలోకి తీసుకోవటంలో మార్క్సిజం ప్రగతిశీల దృక్పథాన్ని ప్రదర్శిస్తుంది. పోరాట శక్తులను వివరిస్తుంది. పోరాట సందర్భాలను పరిపక్వమొనర్చే, పద్ధతులను మనముందుంచుతుంది. విప్లవ శ్రేణులకు వెన్నుదన్నుగా నిలిచి, విప్లవ కార్యాచరణలో రాగల వ్యక్తిగత బలహీనతలను గురించి ముందుగానే హెచ్చరించి సరిదిద్దుకోగల మార్గాలను విశదీకరిస్తుంది. నిత్యం మారుతున్న దోపిడీ శక్తుల అవతారాల ముసుగులను తొలగించి వానిని ఎదుర్కొనగల శక్తివంతమైన పోరాట ఆయుధాలను ప్రజాఉద్యమకారులకందిస్తుంది.

అలాంటి మార్క్సిజం సిద్ధాంత అవగాహనను పెంచుకోవడానికి ఉద్దేశించిన గ్రంథాలు ఇవి. ఇప్పటికే ప్రాథమికంగా మార్క్సిజాన్ని కొంత అధ్యయనం చేసిన వారికీ గ్రంథాలు ఉపయోగపడ్తాయి. "ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్టు థాట్" అన్న ఆంగ్ల బృహద్గ్రంథంలోని కొన్ని అంశాలను ప్రముఖ సాహితీవేత్త శ్రీ ఆర్వియార్ ఈ రూపంలో మనకందిస్తున్నారు. కొన్ని సందర్భాలలో అనువాదంగానూ, మరి కొన్ని సందర్భాలలో అనుసృజనగానూ రచన సాగింది.

క్లుప్తత, స్పష్టతలకోసం అనువైన - సమానార్థక తెలుగు పదాల కోసం పడ్డ శ్రమ మనకు కనిపిస్తుంది. తత్వశాస్త్రంలో ఎదురయ్యే ఆంగ్ల సాంకేతిక పదాలకు సరైన తెలుగు పదాల సృజన ఇప్పుడిప్పుడే ఓ స్థాయికి చేరుకుంటోంది. ఆర్వియార్ ఆ దిశగా చేసిన కృషి ఇందులో చూడగలం.

పాఠకులూ, కార్యకర్తలూ మార్క్సిజం వెలుగులో ఉద్యమిస్తున్న వారూ దీని ఉపయోగాన్ని గ్రహించగలరని మా ఆకాంక్ష."ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్" సంపాదకులకూ, అనువాదకులకూ కృతజ్ఞతలు.

**ఏటుకూరి ప్రసాద్**
సంపాదకుడు
విశాలాంధ్ర ప్రచురణాలయం.

# విషయ సూచిక





# పునాది, ఉపరితల నిర్మాణం

భవన నిర్మాణానికి సంబంధించిన ఉపమానాన్ని పునాది, ఉపరితల నిర్మాణం అంటూ, మార్క్స్, ఏంగెల్స్‌లు వాడారు. యెందుకు? సమాజపు ఆర్థిక నిర్మాణం (యిది పునాది) రాజ్యరూపాల్నీ, సామాజిక చైతన్య రూపాల్నీ నియంత్రిస్తుందనీ, వాటి మనుగడని నియంత్రిస్తుందనీ (యిది ఉపరితల నిర్మాణం) చెప్పే ప్రతిపాదనకు ప్రోద్బలకంగా వు ంగం కోసం. యీ భావన తొలి రూపం "జర్మన్ భావజాలం" మొదటిభాగంలో కనిపిస్తుంది. అక్కడ సామాజిక నిర్మాణానికి సంబంధించిన ప్రస్తావన వచ్చింది. "ఉత్పత్తి, వాణిజ్యాల నుంచి యెకాయెకీ పుట్టుకొచ్చినటువంటి సామాజిక నిర్మాణం అన్ని యుగాలలోనూ రాజ్యానికీ, యితర భావజాలపూరిత ఉపరితల నిర్మాణానికీ పునాది అవుతుంది" అన్న ప్రస్తావన వుంది. అయితే, ఉపరితల నిర్మాణం అన్న భావనను అది ఆధారపడివున్న రెండు సామాజిక స్థాయిలను సూచించడానికి మాత్రమే వాడలేదు. అంటే, రాజ్యం, సామాజిక చైతన్యం అన్న వాటిని మాత్రమేనని. యీ పదబంధం కనీసం ఒకసారైనా ఒక వర్గచైతన్యానికీ లేదా ప్రపంచ దృక్పథానికీ వర్తించేటట్టు వుంది. భిన్నతరహాల ఆస్తుల మీదనుంచి, అస్తిత్వపు సామాజిక స్థితిగతుల నుంచి యావత్తు ఉపరితల నిర్మాణం పుట్టుకొస్తుంది. యిందులో విస్పష్టమైన, చిత్రంగా యేర్పడిన మనోభావాలు, భ్రమలు, ఆలోచనా రీతులు, జీవిత దృక్పథాలు వుంటాయి. మొత్తం ఆ వర్గం యావత్తూ ఆ భౌతిక పునాదుల నుంచి తదనుగుణంగా వుండే సామాజిక సంబంధాల నుంచి దాన్ని సృష్టించి, రూపొందిస్తూ వుంటుంది. (18వ బ్రూమేర్ III) యేది యేమైనప్పటికీ, సమాజపు మూడు సాధారణ స్థాయిల మధ్య వుండే సంబంధాన్ని వివరించడానికే యెక్కువగా యీ ఉపమానాన్ని వాడడం కనిపిస్తుంది. ఆ రకంగా ఉపరితల నిర్మాణంలోని రెండు స్థాయిల్ని పునాది నిర్ణయిస్తుంది. అంటే ఉపరితల నిర్మాణం స్వయంప్రతిపత్తితో వుండదు, తనంతట

తానుగా స్వయంభువు కాదు. సామాజిక ఉత్పత్తి సంబంధాల పునాది మీద వుంటుంది. పర్యవసానంగా యే ప్రత్యేక ఆర్థిక సంబంధాల వ్యవస్థ అయినా ఆయా ప్రత్యేక రాజ్యాల రూపాన్ని, సామాజిక చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. దాని విధుల నిర్వహణకు అవి సరిపోతాయి. ఆర్థిక పునాదిలో యే మార్పు సంభవించినా ఉపరితల నిర్మాణంలో పరివర్తన వస్తుంది.

పునాది అంటే యేమిటి అన్నదానికి సంబంధించి మార్క్స్ మరింత వివరంగా చెప్పేడు. ఆ మాటలు యీ ఉపమానానికి ప్రామాణిక రూపం అయేయి: "తమ జీవిత సామాజిక ఉత్పత్తిలో మనుషులు నిర్దిష్ట సంబంధాలు కలిగి వుంటారు. యీ సంబంధాలు వాళ్ళ యిష్టానిష్టాలతో ప్రమేయం లేకుండా, ఆవశ్యకంగా వుంటాయి. యీ ఉత్పత్తి సంబంధాలు వాళ్ళ భౌతిక ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో ఆ నిర్దిష్టదశలో తూగుతూ వుంటాయి. యీ ఉత్పత్తి సంబంధాలు మొత్తంగా కలిసి ఆ సమాజపు ఆర్థిక నిర్మాణం అవుతుంది. యిదే అసలైన పునాది. దానిమీదనే న్యాయపర, రాజకీయ ఉపరితల నిర్మాణం సాగుతుంది. దీనికి సామాజిక చైతన్యపు నిర్దిష్ట రూపాలు సరితూగుతూ వుంటాయి. భౌతిక జీవిత ఉత్పత్తి విధానం, సాధారణంగా, సామాజిక, రాజకీయ, బౌద్ధిక జీవిత క్రమాల్ని నియంత్రిస్తూ వుంటుంది." ("ఎ కాన్‌ట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ" అన్న గ్రంథానికి ముందుమాట) దీన్నిబట్టి తెలియవచ్చేది యేమిటీ అంటే ఆర్థిక నిర్మాణమే ఫలనా వ్యవస్థల సముదాయంగా, ఉత్పత్తి భాగాలుగా లేదా భౌతిక పరిస్థితులుగా వుంటుందని కాదు. యిది మనుషులు యేర్పరచుకునే మొత్తం ఉత్పత్తి సంబంధంగా వుంటుంది. మరోలా చెప్పుకోవాలీ అంటే, వాళ్ల మధ్య వుండే వర్గ సంబంధాలుగానన్న మాట. మార్క్స్ చెప్పినట్టు, "అది ఉత్పత్తి పరిస్థితుల యజమానులకి, ప్రత్యక్ష ఉత్పాదకునికీ మధ్య ప్రత్యక్ష సంబంధంగానే వుంటుంది. ఈ సంబంధం ఎప్పుడూ సహజంగానే శ్రమపద్ధతుల నిర్దిష్ట అభివృద్ధి దశకి, దాని సామాజిక ఉత్పత్తి దశకి అనుగుణంగా వుంటుంది. అది అంతర్నిహితంగా ఉన్న రహస్యాన్ని

మొత్తం సామాజిక నిర్మాణానికి వున్న గుప్త ఆధారానికీ, సర్వాధిపత్యానికి, పరాధీనతకి మధ్య సంబంధానికి వున్న రాజకీయ రూపాన్ని, దాని పునాదిని వెల్లడిస్తుంది. అంటే దానికి అనుగుణమైన ప్రత్యేక రాజ్యాంగ యంత్రరూపాన్ని అది వెల్లడిస్తుంది." (పెట్టుబడి, 3 వాల్యూం. అధ్యాయం 47, 2)

అయినా యీ సూత్రీకరణలు కనిపించినంత తేలికగా యీ పునాది, ఉపరితల నిర్మాణ సంబంధాల స్వభావం కనిపించదు. అది మరింత సంక్లిష్ట పూరితంగా వుంటుంది. పునాది నిర్ణాయకత అనేదాన్ని ఆర్థికపరమైన అంశానికే కుదించేటట్టు అపార్థం చేసుకోవడం జరగవచ్చుని మార్క్సుకి తెలుసు. అందుకనే ఆయన యీ సంబంధాన్ని చారిత్రకమూ, విషమమూ, ఉపరితల నిర్మాణ సార్థకతతో స్పర్థించేదిగానూ వుంటుందని మరింత విశ్లేషించాడు. చారిత్రక అంశాన్ని గురించి **మార్క్సు** యిలా చాటేడు. "ఆధ్యాత్మిక ఉత్పత్తికీ, భౌతిక ఉత్పత్తికీ **మధ్య వుండే** సంబంధాన్ని పరిశీలించేటందుకుగాను, ఒక **విషయాన్ని** బోధపరచుకోవడం అన్నిటికంటే ముఖ్యం. అది యేమిటంటే **పాదార్థిక** ఉత్పత్తి దానికిగా ఒక సామాన్య అభివర్గంకాదు, అది ఒక **నిర్దిష్ట చారిత్రక** రూపం. ఆ రకంగా, ఉదాహరణకు భిన్నరకాల ఆధ్యాత్మిక ఉత్పత్తి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికీ, మధ్యయుగాల ఉత్పత్తి విధానానికీ అనుగుణంగా వుండచ్చు. భౌతిక ఉత్పత్తిని ఒక **నిర్దిష్ట చారిత్రక** రూపంగా భావించనట్లయితే, దానికి అనుగుణంగా వుండే ఆధ్యాత్మిక ఉత్పత్తిలో యేది నిర్దిష్టమో, పరస్పరం ఒక దానిమీద ఒకటి కలిగించుకునే ప్రభావం యేమిటో బోధపరచుకోవడం అసాధ్యం" (థీయరీస్ ఆఫ్ సర్‌ప్లస్ వాల్యూ. 1 వాల్యూం, అధ్యాయం 4). యిక్కడ ఒక విషయం గమనార్హం అయింది. భౌతిక ఉత్పత్తుల చారిత్రక రూపాలే ఆధ్యాత్మిక ఉత్పత్తి విలక్షణతని నిర్ణయించినా, ఆధ్యాత్మిక ఉత్పత్తి భౌతిక ఉత్పత్తి మీద "పరస్పర ప్రభావం" కలిగించగలిగేటట్టు వుంటుందని చెప్పడం. అంటే, భావాల ఉపరితల నిర్మాణం అనేదాన్ని యేదో స్తబ్ధ ప్రతిఫలనంగా భావించడం లేదు, యేదో సార్థకత సామర్థ్యం వుంది.

రెండవది, కళలతో, న్యాయపర సంబంధాలతో చూస్తే భౌతిక ఉత్పత్తి అసమంగా అభివృద్ధి చెందుతుందన్న విషయం మార్క్సుకి తెలుసు.

ఉదాహరణకు రోమన్ ప్రైవేట్ న్యాయం, పెట్టుబడిదారీ ఉత్పత్తికీ మధ్య సంబంధంలాగా లేదా గ్రీకు కళకీ అభివృద్ధి చెందని ఉత్పత్తి శక్తులకీ మధ్య సంబంధంలాగా. ఆయనే చెప్పినట్టు "కళల విషయంలో, అవి వికసించిన కొన్ని దశలు సమాజం సాధారణంగా అభివృద్ధి చెందిన దశతో అంటే భౌతిక పునాదితో పోలిస్తే, చాలా అధికంగా వుంటాయి... దాని అస్థిపంజరం అయిన ఆ వ్యవస్థతో చూస్తే" (గ్రుండ్‌రిస్సె, పరిచయం) అయితే సమస్య, కొన్ని కళాత్మక, న్యాయరూపాలు అభివృద్ధి చెందని భౌతిక పరిస్థితులకు అనుగుణంగా వుంటాయని అర్థం చేసుకోక పోవడంకాదు: గ్రీకు కళ గ్రీకు పురాణాలమీద ఆధారపడింది. యిది మళ్లీ, స్వాధీనంలోకి రాని లేదా అంతుబట్టని ప్రాకృతిక శక్తుల్ని ఆవాహన చేసే ఆదిమ విధానం. ఏంగెల్స్ చెప్పినట్టు యీ తప్పుడు భావనలకి "పునాదిగా ప్రతికూల ఆర్థికాంశం" వుంటుంది. (సి. ష్మిడ్ట్‌కి రాసిన ఉత్తరం. 1890 అక్టోబరు 27). అసలు సమస్య యేమిటంటే గ్రీకు కళని యింకా సమున్నతమైన దానిగానే పరిగణిస్తూ వుండడం. బాగా అభివృద్ధి చెందిన ఉత్పత్తి విధానాల్లో సైతం ఒక ప్రమాణంగా నమూనాగా యెంచడం. మానవాళి చారిత్రక శైశవ దశ సహజ మురిపెంగా మార్క్స్ దాన్ని వివరించ చూశాడు, కాని అది చాలా అరకొరగా వుంది. కనీసం ఒక విషయాన్ని గుర్తించినట్టు సూచిస్తుంది. అదేమిటీ అంటే కళలు, న్యాయరూపాలు సామాజికంగా నిర్ణయమవుతాయన్న విషయం, యితర యుగాలలో వాటి చెల్లుబాటును తప్పనిసరిగా పరిమితం చెయ్యదు అన్న గుర్తింపు.

మూడవది, ఉపరితల నిర్మాణ సామర్థ్యం గురించి మార్క్స్ నొక్కిచెప్పడం. ఉపరితల నిర్మాణం ఆర్థిక నిర్ణాయకత మీద వుంటుందనే సంగతి పెట్టుబడిదారీ విధానానికే వర్తిస్తుంది కాని ఫ్యూడలిజానికీ, ప్రామాణిక ప్రాచీనతకీ కాదని ఒక అభ్యంతరం వచ్చింది. దానికి జవాబు చెపుతూ మార్క్స్ యీ విషయం చెప్పేడు. ఆ అభ్యంతరంలో ఒక అంశం యేమిటంటే కాథలిక్కు మతం, రాజకీయాలు ఆ ఫ్యూడల్, ప్రాచీన దశల్లో ముఖ్యపాత్ర పోషించాయి అని నిర్ణాయకత సూత్రాన్ని మార్క్స్ ధ్రువపరుస్తూ, ఆ సమయంలో యీ విషయం చెప్పేడు. "మధ్యయుగాలు కాథలిక్ మతం మీదా బతకలేదు, ప్రాచీన ప్రపంచం రాజకీయాల మీదా

బతకలేదు" అని చెపుతూ, "వాళ్ళ జీవనోపాధి సాధించుకున్న పద్ధతి యిక్కడ రాజకీయాలు, అక్కడ కాథలిక్కు మతం ముఖ్యపాత్ర యెందుకు పోషించేయో వివరిస్తుంది" అన్నాడు. (పెట్టుబడి 1, అధ్యాయం 1) అల్థూసర్, తదితర స్ట్రక్చరలిస్ట్ రచయితలు యీ ఉల్లేఖనకు యిలా భాష్యం చెప్పేరు. వాళ్లు "నిర్ణాయకత" కీ "ఆధిపత్యా"నికీ మధ్య తేడా చూపించారు. దీని ప్రకారం ఆర్థికత కడపటిగా నిర్ణాయకంగా వుంటుందేగాని సర్వదా ఆధిపత్య పాత్ర వహించదు అని; ఉపరితల నిర్మాణం రెండు స్థాయిల్లోనూ యేదోఒకటి కొంతకాలంబాటు ఆధిపత్యంలో వుండవచ్చని అది నిర్ణయిస్తుంది. అసలీ భాష్యాన్ని మార్క్స్ ఉల్లేఖన నుంచి రాబట్టవచ్చా, లేదా అన్నది చర్చనీయాంశమే అయినా ఒక విషయం వుంది. పునాది నిర్ణాయకత అనేది ఆర్థిక దృగ్విషయాలకే రాజకీయాల్ని, భావాల్ని కుదించదు అని కనీసం యీ ఉల్లేఖన సూచిస్తోంది. యీ అంశాన్నే ఉపరితల నిర్మాణంలో వున్న "సాపేక్ష స్వయంప్రతిపత్తి" అని చెప్పుకున్నారు.

ఇక ఏంగెల్స్ కూడా "పునాది - ఉపరితల నిర్మాణం" అలంకారాన్ని కుదించేసి వ్యాఖ్యానించే ధోరణిని తూర్పారబట్టేడు. ఆర్థికపరమైన అంశం "అన్నిటికంటే ఆధిక్యం కడకు అనువర్తింప చేస్తుందనీ" లేదా "చివరిగా నిర్ణాయకం అవుతుందనీ" మాత్రమే నొక్కిచెప్పేడు. అయితే "ఆ రంగం స్థాపించిన నియమాల్లోనే అనువర్తిస్తుందనీ" చెప్పేడు. (సి.ష్మిడ్ట్‌కు రాసిన లేఖ 1890 అక్టోబరు 27). యాంత్రిక కార్యకారణ సంబంధ భావన నుంచి ఆయన మళ్ళేడు. యీ భావనవల్ల ఆర్థిక వ్యవస్థ అన్న ఒక స్థాయి యితర స్థాయిలకు కారణం అవుతుంది, ఉపరితలం అన్న యితర స్థాయిలు దాని ఫలితాలు అవుతాయి. "కడపటి నిర్ణాయక స్థానం" అన్న భావనవల్ల యీ అభిప్రాయాన్ని తొలగించి కార్యకారణ సంబంధపు "గతితార్కిక భావన" వస్తుంది. ఆ రకంగా కడపటి నిర్ణాయక అంశం ఉపరితల నిర్మాణ నిర్ణాయకతను తప్పించదు. యిది ద్వితీయశ్రేణి కారణాల్లో వుంటుంది. అదీ కార్యాన్ని కలిగిస్తుంది, పునాది మీద "ప్రతిచర్య" కలిగిస్తుంది. (మెహ్రింగ్‌కు 1893 జులై 14న రాసిన ఉత్తరంలో) యీ అంశాన్ని మరింత బలంగా చెప్పేటందుకనేనేమో ఏంగెల్స్ యిలా కొనసాగించాడు:

"యింతకు మించి యెక్కువగా మార్క్సుగాని నేనుగాని ధ్రువపరచలేదు. అంచేత యెవళ్ళన్నా ఆర్థికాంశమే ఏకైక నిర్ణాయకం అని వక్రీకరిస్తే గనక, అతను యీ ప్రతిపాదనను అర్థం పర్థంలేని, అసంబద్ధ, ఆకుకు అందని పోకకు పొందని పదగుంఫనగా మారుస్తున్నాడన్న మాట" (జె. బ్లాక్‌కి రాసిన ఉత్తరం. 1890 సెప్టెంబరు 21-22)

ఏంగెల్స్ యింకా ముందుకు వెళ్ళి, విభిన్న సమర్థవంతమైన నిర్ణాయకాల మధ్య వుండే సంబంధ లక్షణాన్ని తెలియచేశాడు. అది అనేక ఉపరితల అంశాల మధ్య పరస్పర ప్రతిచర్యలతో వుంటుంది. వాటికీ పునాదికీ మధ్య ప్రతిచర్యలతో వుంటుంది. అయితే యిది "ఆర్థిక అవశ్యకత పునాది మీదే వుంటుంది. యిదే చివరగా సర్వదా దృఢంగా వస్తూ వుంటుంది." (డబ్ల్యు. బోర్గియస్‌కి రాసిన ఉత్తరం. 1894 జనవరి 25). యిలా వివరించడం ఒక విమర్శకు దారితీసింది. హెగెల్ ప్రకృతిభావన సంబంధం అన్న భావం వుంది కదా. పునాది ఉపరితల నిర్మాణం అన్న దాంట్లోకి దాన్ని తెచ్చిపెట్టడం అవుతుందట. అంటే ప్రాథమిక, ద్వితీయ కారణాలు ఆవశ్యకత, యాదృచ్ఛికత మధ్య సంబంధంలాగా నన్నమాట. ఆ రూపేణా ఉపరితల నిర్మాణ సాఫల్యం "అనంతమైన యాదృచ్ఛికతల సమూహం"లో కరిగిపోతుందన్నమాట. అన్ని సందర్భాల్లోనూ మార్క్సిస్టులలో ఏంగెల్స్ వివరణే యెంతో ఆదరణ పొందినదైంది.

1880లలో మార్క్సిజం అభివృద్ధిలోకి పునాది, ఉపరితల నిర్మాణం అన్న ఆలంకారికత చొచ్చుకుపోయింది. దీన్ని యాంత్రికంగా, నిర్ణాయకంగా వుండేటట్టు చేసే భాష్యాల్ని ఏంగెల్స్ శాయశక్తులా ప్రతిఘటించాడు. అయినా కూడా ఆయన ఆ ధోరణిని మళ్ళించ లేకపోయేడు. అలా అని ఆయన రచనలే ఓ మేరకు దాన్ని నిలబెట్టేయి. ఏంగెల్స్ తరవాతి రచనల్లో ఆచరణభావం లోపించడం, సామాజిక కార్యకలాపం నుంచి ప్రకృతి గతితర్క భావం వేర్పాటు కావడం అన్నది ఆ రచనల్లోకి చొరబడడం జరిగింది. పునాది, ఉపరితల నిర్మాణం అన్న దానికి సంబంధించి కుదింపు వైఖరులు పెరగడంలో యిది ముఖ్యపాత్ర వహించింది. అంతేకాదు పరిస్థితి మరొక హేతువువల్ల మరింత దిగజారింది. మార్క్సు తొలి తాత్విక రచనలూ, "జర్మన్ భావజాలం" లాంటి గ్రంథమూ తొలి రెండు తరాల వాళ్లకీ అందుబాటులో వున్నట్లు

తరవాత లేకపోవడంవల్ల యిలా జరిగింది. యీ రచనల్లో ఆచరణ అన్న ఆ భావం చాలా బలంగా వ్యక్తం అయింది. నిజానికి ఆచరణ అన్న మాధ్యమిక భావన లోపించడంతో, పునాది ఉపరితలం అన్న విశాలమైన అలంకారం సమస్యాత్మక భాష్యాలకి దారితీసింది.

మరోపక్క భావాల ఉపరితల నిర్మాణం అనేదాన్ని ద్వితీయశ్రేణి దృగ్విషయంగానూ చెప్పచ్చు. ఒట్టి ప్రతిఫలనం మాత్రమే. దాని వాస్తవికత అంతిమ విశ్లేషణలో ఉత్పత్తి సంబంధాల్లోనే దొరుకుతుంది. ఆ రకంగా చైతన్యం దాని ప్రత్యేక వస్తువు పోయి డొల్ల అవుతుంది. దాని ప్రాముఖ్యం పోతుంది. ఆర్థిక సంబంధాలే అన్న అంశానికి కుదింపు అయిపోతుంది. లెనిన్ చేసిన కొన్ని సూత్రీకరణలు యీ అభిప్రాయానికి తావిస్తున్నాయి. ఉదాహరణకు, తొలినాటి రచన ఒక దాంట్లో సమాజ పరిణామాన్ని “సహజ చరిత్ర” క్రమంగా చూడ్డం జరిగింది. దీన్ని ఉత్పత్తి సంబంధాల మీద కేంద్రీకృతం చేసే బోధపరచుకోగలం. మార్క్స్ “పెట్టుబడి” గ్రంథంలో ఆర్థిక నిర్మాణాన్ని ఉత్పత్తి సంబంధాల మీదనే వివరించాడని, అలా చెయ్యడం ద్వారా ఆయన వాటికి అనుగుణంగా వుండే ఉపరితల నిర్మాణాల వివరణ చేసేడనీ లెనిన్ అన్నాడు. అంటే ఉపరితల నిర్మాణాల్ని వాటికిగా విశ్లేషించవలసిన అవసరం లేదన్నమాట. ఆ తరవాత లెనిన్ యిదే దృక్పథాన్ని ధ్రువపరచాడు. “భౌతికవాదం సామాన్యంగా వస్తుగతంగా యదార్థమైన దాన్ని గుర్తిస్తుంది (పదార్థం). అది మానవాళి చైతన్యం అనుభూతి, అనుభవం వగైరాల్లాంటి వాటినుంచి స్వతంత్రంగా వుంటుంది. చారిత్రక భౌతికవాదం సామాజిక అస్తిత్వాన్ని మానవాళి సామాజిక చైతన్యం నుంచి స్వతంత్రంగా వుంటుందని చెప్తుంది. యీ రెండు సందర్భాల్లోనూ చైతన్యం అనేది అస్తిత్వపు ప్రతిఫలనమే. మహా అయితే సుమారుగా సత్యపూరితమైన (తగినంత, సంపూర్తిగా కచ్చితం) ప్రతిఫలనం.” అయితే యీ మాటలు లెనిన్ రాజకీయ వ్యవస్థీకరణ గురించీ, విప్లవ సిద్ధాంతం గురించీ చెప్పిన వాటితో చూస్తే శుద్ధ వ్యతిరిక్తంగా వున్నాయి. వాటిగురించి ఆయన విపులీకరించిన అంశాలు మరింత ప్రసిద్ధం, కచ్చితంగా కుదింపు వ్యతిరేకం అయినవీనూ.

మరోపక్క కొన్ని భాష్యాలు యీ విశాల అలంకారాన్ని విడి "స్థాయులు"గా చేసే మొగ్గు చూపిస్తున్నాయి, అవి యేదో విలక్షణ "సంపూర్ణాలు", "ప్రాంతాలు" అయినట్టు. యేదో రకంగా అవి ఒకదానికొకటి బాహ్యంగా వుంటున్నట్టు, ఒక వరసక్రమంలో ఒకదాని తరవాత ఒకటి వస్తున్నట్టు. ఉదహరణకు ప్లెహనోవ్ అలాంటి స్థాయిల్ని అయిదింటిని పట్టిక చేశాడు: 1) రాజ్యం, ఉత్పత్తి శక్తులు, 2) యీ శక్తులు నియంత్రించే ఆర్థిక సంబంధాలు 3) ఆ ఫలానా ఆర్థిక "పునాది" మీద పెరిగిన సామాజిక - ఆర్థిక వ్యవస్థ 4) ఆ సమాజంలో జీవిస్తూవున్న వాళ్ళ మనస్తత్వం. యిది ఓ రకంగా ఆ వున్న ఆర్థిక పరిస్థితులమీద నేరుగానూ ఆ పునాది మీద నుంచి ఉత్పన్నమైన మొత్తం సామాజిక ఆర్థిక వ్యవస్థ నుంచి మరో రకంగానూ నిర్ణయమవుతుంది. 5) ఆ మనస్తత్వ ధాతువుల్ని ప్రతిఫలించే వివిధ భావజాలాలు. అయితే యీ విశాల, క్రమానుగత నిర్మాణం ఒక విషయాన్ని అందించడంలో విఫలమవుతుంది. అదే కీలకమైన వాస్తవం. అదేమిటీ అంటే యీ "స్థాయిలన్నీ మనిషి ఆచరణాత్మక కార్యకలాపం నుంచి వచ్చినవే. సమాజంలోని వైవిధ్యభరిత స్థాయిలన్నిట్నీ విడిగా అందివచ్చిన అంశాలుగా గ్రహించడం జరుగుతోంది. మరి సామాజిక సంపూర్ణత్వం యెలా ఆవిర్భవిస్తుంది అన్నదానికి యిక్కడ వివరణ లేదు. యీ రకంగా సమస్యను ముందుపెట్టినట్లయితే, నిర్ణాయకత భావం క్లిష్టం అవుతుంది: ఒక వస్తుగత సందర్భంగా ఆర్థిక వ్యవస్థ మరొక వస్తుగత సందర్భంగా కళనో సిద్ధాంతాన్నో యెలా తయారు చెయ్యగలదు?"

చివరికి తేలేది యేమిటీ అంటే, పునాది ఉపరితల నిర్మాణం అనే ఉపమానం కచ్చితంగా ఫలానా అనే అర్థాన్ని అందించకపోవడం. యిలా యెందుకనీ అంటే యేకకాలంలో రెండు పాత్రల్ని దాన్ని పోషించమని చెప్పడం: పెట్టుబడిదారీ విధానంవల్ల వచ్చిన సమాజపు ప్రత్యేక స్థాయిల పరిణామాన్ని వివరించడం, యీ స్థాయుల్లో ఒకటి మరోదాన్ని యెలా నిర్ణయిస్తుందో వివరించడం. మొదటి కర్తవ్యాన్ని నిర్వహించడం సరిపోతుందన్నట్టు తోస్తుంది. అంటే వ్యవస్థల భిన్నత్వ పరిణామం వివరించడానికి సాయపడుతుంది, ఆచరణలో ప్రత్యేక "రంగాల"కి సంబంధించీనీ - ఆర్థిక, రాజకీయ, బౌద్ధిక - వీటికి వాటి వాటి ప్రత్యేక

యంత్రాంగాలు వుంటాయి. కాని రాజకీయాల సామాజిక చైతన్య నిర్ణాయకతను వివరించడానికి యిది తగినంతగా వున్నట్టు తోచదు. లేదా ఆ సంపూర్ణత్వంలో ప్రతి స్థాయి ఆవిర్భావం గురించి వివరించడానికీ చాలదు. అది వర్గపోరాటం, లేదా కార్యాచరణలాంటి చలనశీల అంశాల్ని మిగిలిన వాటినుంచి ఒక ప్రత్యేక స్థాయికి విడదీసి కుదించేటట్టు తప్పనిసరి స్థిరీకృత అలంకారంగా వున్నంతకాలం యింతే. అంచేత పునాది ఉపరితలాన్ని నిర్ణాయకం చెయ్యడం అనేది బాహ్యాకారక ధోరణి అవుతుంది.

# సౌందర్యశాస్త్రం

మార్క్స్, ఎంగెల్స్‌ల రచనల్లో కళ గురించి ఒక ప్రామాణిక సిద్ధాంతం లేదు. ఇద్దరికీ కూడా మొదటినుంచీ సౌందర్యశాస్త్రం పట్లా, కళ పట్లా ఆసక్తి వుండేది. అది జీవితాంతం నిలిచింది. అయితే యీ విషయాలకు సంబంధించి అడపాదడపా అనేక సందర్భాల్లో ప్రస్తావిస్తూనే వచ్చారు, చర్చల్లోనూ ముచ్చటిస్తూ వచ్చారు. మార్క్సిస్టు సౌందర్యశాస్త్రాన్ని రూపొందించడానికి జరిగిన అనేక ప్రయత్నాల్లో ఆ అభిప్రాయాలే ఆధారమయేయి. యీ ప్రయత్నాలు గత కొన్ని దశాబ్దాల్లో యెక్కువగానూ వున్నాయి. మార్క్సిస్ట్ సౌందర్యశాస్త్రాన్ని ప్రత్యేకంగా తయారుచేసే ప్రయత్నాలు యివి. మార్క్స్, ఎంగెల్స్‌లు అడపాదడపా అక్కడా ఇక్కడా కళల గురించి వెల్లడించిన అభిప్రాయాల్ని గుదిగుచ్చి యిటీవలి కాలంలో సంకలనాలుగా ప్రకటించారు. మార్క్సిస్టు చింతన కళలకు సంబంధించి యెలా వుండిందో, అభివృద్ధి చెందుతూ వచ్చిందో సమీక్షించే గ్రంథాల్లో చూపించే ప్రయత్నాలూ జరిగాయి. (అర్వాన్ 1973, లైంగ్ 1978). యీ వ్యాఖ్యలు సత్కృత్తుగానే వున్నా తరవాతి రచయితల రచనల్లో అనేక వక్కాణింపులకీ, వాదనలకీ దోహదం కలిగించాయి. మార్క్స్, ఎంగెల్స్‌ల రచనల్లో వున్న ప్రతిపాదనలు యేమిటో, అనేకమంది రచయితలకు అవి యెలా సూచనలు అందించాయో తెలుసుకోవడం ఆసక్తికరంగా వుంటుంది. మార్క్సిస్టు సౌందర్యశాస్త్ర చరిత్ర గురించీ, యీ రంగంలో యిటీవలి రచనల్లో కనిపించే ముఖ్య అంశాల గురించీ తెలుస్తుంది.

## మార్క్స్, ఎంగెల్స్‌ల రచనల్లో సౌందర్యశాస్త్రం:

కళ స్వభావం గురించి మార్క్స్ చేసిన వ్యాఖ్యల నుంచి ఒక మానవీయ సౌందర్యశాస్త్రం రూపొందింది. కళ సృజనాత్మక శ్రమగా యిందులో కనిపిస్తుంది. యితర (పరాయీకరణ చెందిన) శ్రమకంటే గుణాత్మకంగా భిన్నం కాదు. (వాజ్క్వెజ్, 1973). మార్క్స్ మౌలికంగా శ్రమ తత్వం గురించి చెపుతూ (పెట్టుబడి 1, అధ్యాయం 5, విభాగం 1) వాస్తుశిల్పినీ, తేనెటీగనీ పోలుస్తూ సామ్యం చెప్తాడు. యిక్కడ శిల్పి ప్రస్తావన చెయ్యడం, అతను ఒక ప్రత్యేక హోదా వున్న కళాకారుడనిగాక మనిషిగా శ్రామికుడని చెప్పడమే ఉద్దేశం. పరాయీకరణ చెందని సకల శ్రమ సృజనాత్మకమైందేనన్న భావన యిక్కడ వుంది. అంచేత స్వభావతః కళాత్మక శ్రమ లాంటిదే. యీ భావన మానవీయ సౌందర్యశాస్త్రానికి పునాది అవుతుంది. దీనివల్ల మనం కళని చారిత్రక అభివృద్ధి కోణం నుంచి చూడగలుగుతాం; యితర కార్యకలాపాల నుంచి వేర్పాటు చెయ్యకుండానూ చూసే దృష్టి వస్తుంది. ఆ రకంగా కళని ఆవరించుకుని వున్న పొరలు తొలగిపోతాయి.

ఈ భావాన్ని అనుసరించి వచ్చేదే, కళ యితర శ్రమల్లాగానే పెట్టుబడిదారీ విధానంలో, రానురాను పరాయీకరణ శ్రమ అవుతుందన్న అభిప్రాయం. కళే ఒక సరుకు అవుతుంది. కళాత్మక ఉత్పత్తి సంబంధాలు కళాకారుడి స్థాయిని పీడనకు గురయే శ్రామికుడి స్థాయికి దిగజారుస్తాయి. అధనపు విలువను సృష్టిస్తూ అలా చేస్తాయి. మార్క్స్ "థీరీస్ ఆఫ్ సర్ప్లస్ వాల్యూ," 1 భాగం, "ఉత్పాదక, అనుత్పాదక శ్రమ" అన్న అనుబంధంలో యిలా అన్నాడు: "పెట్టుబడిదారీ ఉత్పత్తి కొన్ని ఆధ్యాత్మికశాఖల ఉత్పత్తికి, ఉదాహరణకు కళ - కవిత్వం అనే వాటికి, ప్రతికూలంగా వుంటుంది." పెట్టుబడిదారీ విధానంలో కళాత్మకశ్రమ పరివర్తన గురించి వివరించాడు కూడా:

"అయిదు పౌండ్లకు" "పారడైజ్ లాస్ట్" రాసిన మిల్టన్, **అనుత్పాదక శ్రామికుడు.** అలాకాక, ఫాక్టరీ తరహాలో ప్రచురణకర్తకు సరకు తయారుచేసిపెట్టే రచయిత **ఉత్పాదక** శ్రామికుడు... ప్రచురణకర్త ఆదేశాల మేరకు... పుస్తకాలు అల్లే లీప్జిగ్ సాహితీ శ్రామికుడు, **ఉత్పాదక శ్రామికుడు.** యేమంటే ఆదినుంచీ అతని ఉత్పత్తి పెట్టుబడికి అంతర్గతం

అయిపోయింది. ఆ పెట్టుబడిని మరింత చేసే ఉద్దేశ్యంతోనే వెలుగులోకి వస్తుంది. తన తెరువు కోసం పాట అమ్ముకునే గాయని **అనుత్పాదక శ్రామికురాలు.** అదే గాయని, సొమ్ము చేసుకునే నిమిత్తం వ్యాపారం సాగించేవాడి ఆదేశానుసారం నడుచుకుంటే **ఉత్పాదక శ్రామికురాలు** అవుతుంది. మరి ఆవిడ పెట్టుబడిని ఉత్పత్తి చేస్తోంది కదా."

పెట్టుబడిదారీ విధానంలో కళ వక్రీకరణ గురించీ, సాంస్కృతిక ఉత్పత్తుల గురించీ చేసిన యీ విశ్లేషణ "సంస్కృతి పరిశ్రమ"ని విమర్శించే తర్వాతి వాళ్ళకి ఆధారం అయింది. (ఉదాహరణకు అడార్నో, హార్క్‌హేమర్). విలువ నియమ నియంత్రణవల్లా, సాంస్కృతిక ఉత్పత్తులు సరుకులుగా పరివర్తన చెందడంవల్లా సంస్కృతి, కళ అనేవి ఒకే బాణీలో, చర్విత చర్వణంగా, పనికిమాలిన విషయాలుగా తయారవుతాయి. రాజకీయ ప్రశాంతత భద్రంగా వుండేటట్టు చూడడం వీటిపని. సరకు ఆరాధన గురించి మార్క్స్ చెప్పిన సాధారణ సిద్ధాంతం వుంది కదా. దీన్నుంచి మార్క్సిస్టు సౌందర్యశాస్త్రవేత్త ల్యూకాక్స్ కళ గురించి ఒక సిద్ధాంతాన్ని వృద్ధిచేశాడు. ఆయన ప్రముఖ తాత్విక గ్రంథం "చరిత్ర - వర్గచైతన్యం" (History and class consciousness). అందులో ఆయన పెట్టుబడిదారీ విధానంలో పదార్థీకృతం అయిన, భిన్నం అయిన మానవ జీవిత స్వభావాన్నీ, అనుభవాన్నీ విశదపరిచాడు. చైతన్యం మీద సరకు ఆరాధన (Commodity fetishism) ప్రభావం యెలా వుంటుందో విశ్లేషిస్తూ వివరించాడు. అసంపూర్ణంగా వున్న చింతన సామాజిక, ఆర్థిక సంబంధాల పూర్ణత్వాన్ని గ్రహించలేదు. తరవాత ల్యూకాక్స్ జీవితం యావత్తూ సాహిత్యానికీ, సౌందర్యశాస్త్రానికీ అంకితం అయింది. ఆ కృషిలో "పూర్ణత్వం" అన్న భావనే కేంద్ర స్థానంలో వుంది. ల్యూకాక్స్ అభిప్రాయంలో పైపైన కనిపించే వాటిలోకి లోతుగా చొచ్చుకుపోయేదే మహత్తర సాహిత్యం. అది సామాజిక పూర్ణత్వాన్ని గ్రహించి, వెల్లడిచెయ్యాలి. సామాజిక పూర్ణత్వంలో వుండే వైరుధ్యాలన్నీ వెల్లడికావాలి.

దీనికి సంబంధించిందే కళలో వాస్తవికత అన్న సిద్ధాంతం. ల్యూకాక్స్ అభిప్రాయంలో "నమూనా" ప్రాయమైన పాత్రల ద్వారా పూర్ణత్వాన్ని చిత్రించేదే మంచి "వాస్తవిక" సాహిత్యం. వాస్తవికత

గురించిన యీ అభిప్రాయానికి మార్క్సిజం ప్రతిపాదకుల యితర రచనల నుంచీ వత్తాసు అందుతుంది. ముఖ్యంగా, 1880లలో, నవలలు రాయాలని కోరుకునే నవలా రచయిత్రులకు ఎంగెల్స్ రాసిన రెండు ఉత్తరాలలో యీ వత్తాసు దొరుకుతోంది. "ఉద్బోధ సాహిత్యం" అని పిలిచేదాన్ని ఆయన యీ ఉత్తరాల్లో నిర్ద్వంద్వంగా తిరస్కరించాడు - అంటే వెల్లడిగా రాజకీయ సందేశాన్ని అందించే సాహిత్యం అన్నమాట. ఆయన "వాస్తవ" విషయం వుండాలన్నాడు. దాన్నుంచే సరైన రాజకీయ విశ్లేషణ అందవచ్చుకదా. రచయిత అభిప్రాయాలు యెంతలా గుప్తంగా వుంటే అంతలా అది కళకు మేలు. "నేను సూచిస్తూ వున్న వాస్తవికత, రచయిత అభిప్రాయాలు యేమైనాగానీ, వెల్లడికావచ్చు" (మార్గరెట్ మార్కినెస్‌కి రాసిన ఉత్తరంలో, 1888, ఏప్రిల్. మార్క్స్, ఎంగెల్స్ "ఆన్ లిటరేచర్ అండ్ ఆర్ట్" 1873), ఆయన బాల్జాక్ ఉదాహరణని యిచ్చాడు. బాల్జాక్ లెజిటిమిస్టు. ఆయన సానుభూతులన్నీ కొడిగట్టి ఆరిపోయే వర్గం మీదే వున్నాయి. అయినా ఆయన "ఫ్రెంచి సమాజపు" అద్భుత వాస్తవిక చరిత్రను అందించాడు. సమాజాన్ని కచ్చితంగా చిత్రించడం, దాని నిర్మాణపర (వర్గ) పోరాటాల్ని 'నమూనాల' ద్వారా చిత్రించడం మార్క్సిస్టు సౌందర్యశాస్త్రంలో మూలభూత అంశం.

కళగాని, సాహిత్యంగాని ఆయా ఫలానా నిర్దిష్ట సమాజాల్లో పుట్టుకొస్తాయి. వీటికీ, ఆయా సమాజాలకీ మధ్య వుండే సంబంధాలు యేమిటి అన్న సూత్రీకరణలు 1859లో మార్క్స్ వెల్లడించిన అభిప్రాయంలోనే తెలియ వస్తున్నాయి. "కంట్రిబ్యూషన్ టు ద క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి" అన్న గ్రంథానికి ఆయన ముందుమాట రాశాడు. అందులో ఆయన పునాది, ఉపరితల నిర్మాణం అన్న ఉపమానం తెచ్చాడు. సౌందర్యశాస్త్రం ఉపరితల నిర్మాణంలో భాగం అని యిక్కడ తేటతెల్లంగా తెలుస్తూనేవుంది. యిదీ ఒక "భావజాల రూపమే". వర్గపోరాటం యిందులో సాగాలి.

కళ ఆ కాలపు భావజాల వ్యక్తీకరణ అన్న అభిప్రాయం తొలిదశలో రూపొందడం ప్లెహనోవ్ రచనలో కనిపిస్తుంది. ఆయన అభిప్రాయంలో "సాహిత్యం, కళ సామాజిక జీవితానికి అద్దంపడతాయి" (అర్వాన్, 1973). యిలాంటి విపులీకరణ, ముతకస్థాయికి దిగితే, కళ

అనేది సామాజిక సంబంధాల, వర్గనిర్మాణ పర ప్రతిబింబం కంటే మరేమీకాదు. యీ భౌతిక లక్షణాల నుంచి దానికదిగానే అవతరిస్తుందన్నమాట. అలాగాక, ఒక భావజాలంగా కళ గురించిన విపులీకరణలు యిటీవలి కాలంనాటి రచయితల రచనల్లో కనిపిస్తున్నాయి. ఉదాహరణకు, గోల్డ్‌మన్.

కడగా, మార్క్సిస్టు సౌందర్యశాస్త్రంలో మరో భిన్నమైన సంప్రదాయం వుంది. యిది కళకు గల విప్లవ పూరిత శక్తిని గురించి, కళాకారుడి నిబద్ధత గురించి నొక్కిచెపుతుంది. వాస్తవికత గురించి ఎంగెల్స్ చేసిన వ్యాఖ్యలు ఒక అంశాన్ని విశదం చేస్తున్నాయి. వెల్లడిగా ఒక పక్షం తరపున వకాల్తా పుచ్చుకోవడంకంటే నిష్పాక్షిక వర్ణనకే ఆయన యెక్కువ మొగ్గు చూపించినట్టు యీ వ్యాఖ్యలు తెలియచేస్తాయి. యేమైనా మార్క్స్, ఏంగెల్స్‌ల రచనల ఆధారంగా కళల్లో తీవ్రవాద సిద్ధాంతాన్ని మార్క్సిస్టులు తయారుచేశారు. రచయిత తన కళను పార్టీ సేవకోసం వినియోగించాలని లెనిన్ సూచించాడు. (యీ ముక్కను ఆయన రసహీనతకు సాకుగా చూపించేవాళ్ళు కళ గురించీ, సాహిత్యం గురించీ ఆయన రాసిన వ్యాసాల్ని పట్టించు కోవడంలేదన్నమాట. ముఖ్యంగా టాల్‌స్టాయ్ గురించి ఆయన రాసిన వ్యాసాలు చూడండి). "మనుషులు తమ చరిత్రను తామే నిర్మించుకుంటారు", రాజకీయ పరివర్తనలో చైతన్యం కీలకపాత్ర వహిస్తుంది అన్నవి మార్క్సిస్టు భావనలు. వీటి ఆధారంగా మయకోవ్‌స్కీ, బ్రెహ్ట్, బెంజమిన్‌లాంటి మహనీయుల నుంచి, యివాల్టి సినిమా నిర్మాతలైన గోదర్ట్, పాసోలినీ దాకా వున్న అలంకారశాస్త్రవేత్తలు, కళాకారులు విప్లవాత్మక సౌందర్య ఆచరణ కార్యక్రమాన్ని రూపొందించారు.

**మార్క్సిస్టు సౌందర్యశాస్త్రంలో ప్రముఖ అంశాలు:**

మార్క్సిస్టు సౌందర్యశాస్త్రంలో అధిక భాగం కీలకమైంది "వాస్తవికత" అన్న భావన. మార్క్సిస్టు సౌందర్యశాస్త్ర శాఖలైన సోషలిస్టు వాస్తవికతలాంటి వాటిలో కూడా యిదే భావన వుంది. (అది అధికారిక సోవియట్, చైనీస్ పాఠాల్లో గానీయండి, పాశ్చాత్య దేశాల మార్క్సిజంలో కానీయండి. లెయింగ్ (1978), అర్వాన్ (1973) రచనలు చూడండి.)

యిది రెండు రకాల దాడికి గురి అయింది కూడా. మొదటిది ల్యూకాక్స్‌కీ, బ్రెష్ట్‌కీ మధ్యసాగిన తొలి వివాదం. (బ్లాక్ (1977), అర్వాన్ 1973) ప్రామాణిక పందొమ్మిదవ శతాబ్దపు వాస్తవికవాద సాహిత్యం యిరవయ్యో శతాబ్ది పాఠకులకి, ప్రేక్షకులకి పనికిరాదని, ముఖ్యంగా యెందుకంటే దానికి సమరశీల ఉత్సాహం కలిగించే సత్తాలేదని యీ వివాదంలో బ్రెష్ట్ వాదించాడు. యీ సమస్య యిప్పుడు కళనీ, సాహిత్యాన్నీ మూల్యాంకనం చేసే అంశం అయింది. ఆ మూల్యాంకనం సమాజాన్ని కచ్చితంగా, సవిమర్శకంగా కళ చిత్రించడానికి సంబంధించి వుండవచ్చు లేక ప్రాథమికంగా కళ విప్లవశీల సామర్థ్యానికి సంబంధించీ వుండవచ్చు. యీ చర్చకు సంబంధించిన యీనాటి రూపాలు మార్గదర్శక (avant garde) నూతన రీతి ప్రతిపాదకులకీ, కళలో, సాహిత్యంలో, నాటకంలో మరింత సాంప్రదాయిక ఉక్తి రూపాల సమర్థకులకీ మధ్య వున్నవని చెప్పవచ్చు. యిక్కడ చెప్పుకున్న రెండవ తరహావాళ్ళు, తీసుకున్న వస్తువు యెంత తీవ్రవాదపూరితమైందైనా స్తబ్ధ, అవిమర్శక దృష్టి కోణం అవలంబిస్తారని మొదటిరకం వాళ్ళు వాదిస్తూ వుంటారు. వాస్తవికత మీద జరిగే రెండవ దాడి యీ వాదనకు సంబంధించే వుంటుంది. సాంప్రదాయిక వాస్తవికత ఒక ఏకీకృతమైన, పొందికైన కథనం మీద ఆధారపడి వుంటుందనీ, అంచేత అది ప్రతిఫలింపచేసేదాంట్లో వున్న అసలైన వైరుధ్యాల్ని, ఘర్షణలనీ మసకబారుస్తుందనీ, ఆ రకంగా ప్రపంచాన్ని ప్రతిబింబించడంలో ఒక కుహనా ఏకతను ముందుపెడుతుందనీ యీ వాదం చాటుతుంది. అలాకాక, ఆధునిక కృతి – వైరుధ్యాల్ని అందుకో గలుగుతుంది. మరుగున వున్న, మూగజీవులు గళం విప్పేటట్టు చేస్తుంది. కథన అవశేషం, జోక్యంలాంటి నైపుణ్యాలతో అలా చేస్తుంది. యీ ధోరణి పీయరె మాషిరే వల్ల ప్రభావితం అయింది. ఈయన ఆల్తూస్సర్ సహచరుడు. అలాగే రోవాండ్ బెర్తెస్, జూలియాక్రిస్తేవా లాంటి రోగ విజ్ఞానశాస్త్రవేత్తల వల్ల కూడా ప్రభావితం అయింది.

**ఒక భావజాలంగా కళ** అన్న సిద్ధాంతం యిటీవలి కాలంలో యెంతగానో సంస్కరణ పొందింది, పరివర్ధితం అయింది, ముఖ్యంగా పాశ్చాత్య మార్క్సిజంలో. అక్కడనే కాదు, తూర్పు జర్మనీ, యు ఎస్ ఎస్.

ఆర్‌లలో కూడా. కళ అనేదాన్ని ఒక ముఖ్యమైన అర్థంలో భావజాలాత్మకం అయిందిగానే భావిస్తూ వున్నాగానీ, దీన్ని యేదో సామాజిక జీవిత ప్రతిఫలనంగా మాత్రమే చూసి తీసి పారెయ్యడం లేదు. ఒక మాధ్యమ రూపంలో భావజాలాన్ని వెల్లండించేదిగా దీన్ని పరిగణించడం జరుగుతోంది. ముఖ్యంగా సంజ్ఞలకీ, ప్రతిపాదించే రూపాలకీ సముచిత స్థానం యివ్వడం జరుగుతోంది. సాహిత్య, కళాత్మక రూపాల్లో భావజాలం అందేందుకు యివి ముఖ్య స్థానంలో వుంటాయి, సంప్రదాయంగా వుంటాయి. నిర్మాణత, ప్రతీక సూచనలాంటి వాటి ప్రభావం ముఖ్యం, రష్యన్ ఫార్మలిస్టుల కృషి (బెన్నెట్ 1979) పట్ల ఆసక్తి పునరుద్ధరణ పొందినట్టు. కృతుల స్వభావం, ఆవిర్భావం గురించి అవగాహన చేసుకోవడానికి కళాసంస్థల, ఆచారాల ప్రాముఖ్యం రాను రాను పెరుగుతోంది. ఉదాహరణకు, ప్రచురణకర్తల పాత్ర, ఆర్ట్ గాలరీలు, విమర్శకులు లాంటి మాధ్యమాల పాత్రవంటివి. అయితే గాలరీల గురించీ, విమర్శకుల గురించీ యేకొద్ది మంది మాత్రమో గట్టిగా పట్టించుకున్నారంతే. వీళ్ళల్లో అధికభాగం కళల గురించీ, మాధ్యమాల గురించీ చూసే మార్క్సిస్టు సామాజికశాస్త్రవేత్తలే. యిక చివరిగా, కళలో అంతర్భాగం అని ఒక మేరకు ప్రేక్షకుల పాత్ర, పాఠకుల పాత్ర గుర్తించడం జరుగుతుంది. ముఖ్యంగా "గ్రుండ్‌రిస్సె"లో మార్క్స వ్యాఖ్యని ఉల్లేఖించే రచయితలు యీ గుర్తింపు యిస్తున్నారు. "వినిమయం ఉత్పత్తిని సృష్టిస్తుంది" అన్న మాటను మార్క్స "గ్రుండ్‌రిస్సె" ముందుమాటలో ప్రస్తావించాడు. వ్యాఖ్యానించాలన్న సిద్ధాంతం, చిహ్నాల పరిశీలన, సౌందర్య గ్రాహ్యత - వీటిల్లో చాలా మట్టుకు మార్క్సిస్టు సంప్రదాయంలో వాటికిగా అవిలేవు - ఇలాంటివన్నీ సాంస్కృతిక కృతుల సృష్టిలో, వాటి అంతరార్థాల్లో గ్రహీతల క్రియాశీల పాత్రని విశ్లేషించడానికి లోచూపునీ, పరికరాల్నీ అందించాయి. అంటే, ఒక కృతి అంతరార్థం యిక యెంత మాత్రమూ స్థిరంగా యిదేనని గిరిగీసుకు కూర్చోవడం అనేది పోయింది. దాన్ని గ్రహించేవాళ్ళ మీద అది ఆధారపడింది.

"సౌందర్యశాస్త్రం, రాజకీయాలు" అన్న సమస్య సమకాలీన మార్క్సిస్టు సౌందర్యశాస్త్రంలో కీలకంగానే వుంది. (బాక్సన్‌డాల్, 1972).

యిది, పైన చర్చించుకున్న వాస్తవికత అన్న దాని గురించిన చర్చలకు, సంబంధించి వుంది. బెంజమిన్ రచనలపట్ల ఆసక్తి పుంజుకోవడంతో కళాసృష్టిని విప్లవీకరించే సాధనంగా చెయ్యడం మీద దృష్టి లగ్నం అయింది. అది ఒక రాజకీయ చర్యగా, వ్యూహంగా వుండాలి. తీవ్రవాద వస్తువు వుందా, సాంస్కృతిక రూపాలు యేమిటీ అన్న వాటిమీదనే మొత్తం దృష్టి పెట్టడం కంటే యిలా వుండాలి. యివాల్టి చర్చల్లో మరో పార్శ్వం వచ్చింది. అది టెలివిజన్లో తీవ్రవాద భావాలు ఫలవంతంగా వెల్లడి అవుతున్నాయా అన్న సమస్యని పరిశీలించడం. ముఖ్యంగా సోషలిస్టు నాటక కర్తలకి సంబంధించి యీ పరిశీలన సాగుతుంది. టెలివిజన్‌కి వున్న ప్రేక్షక ఆదరణని బట్టీ, సాంకేతిక కొత్త పోకడలని బట్టీ "బ్రెష్టియన్" రీతుల బట్టీ యిది ప్రాముఖ్యం సంతరించుకుంది. లేదా నాటకరంగస్థలం గురించీ యిలాంటి పరిశీలన వుంది. నాటక రంగస్థలం నిర్మాణపరంగా, వృత్తిపరంగా మరింత సడలింపుతో వుంటుంది. అలాగే సామూహిక లేదా వీధి ప్రదర్శనలు వున్నాయి. సిద్ధాంతపర పరిమితులు వున్నాయి. వీటి ప్రేక్షకులు అంత పెద్దగా వుండరు. యిక ఆఖరుగా స్త్రీవాద ధోరణి పెరగడంతో మార్క్సిజాన్నే స్త్రీవాద కోణం నుంచి విమర్శించడం వచ్చింది. దాంతో యిటీవలి కాలంలో సోషలిస్టు - ఫెమినిస్టు సాంస్కృతిక ఆచరణ సిద్ధాంతం వృద్ధిచెందాయి. దాంతో పితృస్వామిక యితివృత్తాల్ని కళల్లో విమర్శించడం, నాటక రంగస్థలంలో యితర సాంస్కృతిక సంస్థల్లో పితృస్వామిక సంబంధాల్ని విమర్శించడం వచ్చాయి. వర్గం, భావజాలం అనే సమస్యలకి సంబంధించి నొక్కి చెప్పడం నుంచి అడుగు వెనక్కి పడడం జరిగింది.

ఇక చివరిది. మార్క్సిస్టు సౌందర్యశాస్త్ర పరిణామంతో "సౌందర్యపు విలువ" అన్న భావం సమస్యగా తయారైంది. కళలే కాదు, కళా విమర్శనాత్మక తీరులు, సంస్థలు కూడా భావజాలాత్మకం అయినవనీ, పరస్పర సంబంధం కలిగి వున్నవనీ భావించడం వచ్చింది. దాంతో కళాత్మక కృతులు ప్రసాదించే విలువ సాపేక్ష, నిర్నిరోధ స్వభావం వెల్లడైంది. యిటీవలి కాలందాకా మార్క్సిస్టు సౌందర్యశాస్త్రవేత్తలు దీన్నొక సమస్యగా భావించలేదు. ల్యూకాక్స్ లాంటి రచయితలు సాహిత్యంలో "మహత్తర సంప్రదాయాన్ని" కాపాడ గలిగారు. యీ యత్నం

ఆశ్చర్యకరంగా బూర్జువా విమర్శ ప్రధాన స్రవంతి సంప్రదాయానికి సన్నిహితంగా సాగిందని చెప్పాలి. ఒక రకమైన రాజకీయ సౌందర్యశాస్త్ర ప్రమాణం ఆసరా చేసుకుని అలా చేశారు. "ఉన్నత స్థాయి" కళ, జనసామాన్యానికి హితమైన కళ, అన్న రెండింటికీ మధ్య సంబంధం యేమిటన్న సమస్య, విమర్శకుడి పాక్షిక ధోరణి సమస్యలాగా, యెవళ్ళూ తడమకుండానే మిగిలిపోయింది. విలువ యేమిటన్న ప్రశ్న యివాళ మార్క్సిస్టులికి అనేక రకాలుగా యెదురవుతోంది. యిందులో భావజాల విమర్శలో సాపేక్షంగా అంతర్గర్భితంగా వున్న వాటికి యిష్టాపత్తిగా తలవూపడం దగ్గర నుంచి సౌందర్య సంబంధి అయిన అపరిమేయ ప్రమాణాల్ని పునః ప్రతిష్ఠించడం దాకా వున్నాయి. అలాగే విలువ గురించీనీ. మానవ శరీరశాస్త్రపరమైన లేదా మానసిక శాస్త్రపరమైన అని చెప్పే మానవ సార్వత్రిక అంశాల ఆధారంగా యిలా చెయ్యడం జరుగుతోంది.

# సంస్కృతి

భావజాలం గురించి యిది "మార్క్సిస్టు భావజాలం" అని చెప్పగలిగినట్టుగా, సంస్కృతి విషయం గురించి చెప్పలేం. యిదీ మార్క్సిస్టు "సంస్కృతి" దృక్పథం అని చెప్పలేం. చాలామంది యీ భావనను మార్క్సిస్టులకు మరీ వెలపరం పుట్టించేటట్టు వాడిన ధోరణులూ లేకపోలేదు. అది "కళ కళ కోసమే"నని సమర్థించుకొనేది కావచ్చు. లేదా మానవ వర్గీకరణశాస్త్రాన్ని భౌతికవాద దృక్పథం దృష్ట్యా తిరస్కరించేది కావచ్చు. (సహలిన్ 1976). అయితేనేం, సౌందర్యశాస్త్రం గురించి ఇరవయ్యో శతాబ్దంలో సాగిన చర్చల్లో అధికభాగం, మరింత సామాన్యంగా సాంస్కృతిక సమస్యల చర్చలు మార్క్సిస్టులవే. అదీగాక యావత్తు మార్క్సిస్టు, సోషలిస్టు పద్ధతికీ ఒక కీలకమైన సాంస్కృతిక పార్శ్వం వుంది. సాంస్కృతిక, భావజాలాత్మక సమస్యలు పాశ్చాత్య మార్క్సిజానికి యెంత కీలకంగా వున్నాయంటే, కొంతమంది రచయితలు ఒక ప్రత్యేక ధోరణి "సాంస్కృతిక" మార్క్సిజం అన్న గుర్తింపుతో వున్నారు.

సంస్కృతి అన్న పదాన్ని రెండు రకాలుగా వాడడం కనిపిస్తుంది. అలా వాడడంలో రెండు భిన్నధ్రువాలుగా దాన్ని పరిగణించవచ్చు.

ఒకదాంట్లో అది సౌందర్య పరిధిని సూచిస్తుంది. ముఖ్యంగా కళలు, సాహిత్యం అనేవి. వాటి మధ్య వుండే సంబంధాన్ని చెప్పేది. యిక అటుపక్క మానవశాస్త్రపరంగా ఆ పదాన్ని వాడడం. ఒక సమాజంలో "యావత్ జీవిత విధానాన్నీ" యిది సూచిస్తుంది. తరచుగా దీన్ని భావవాద ధోరణిగా పరిగణిస్తూ వున్నారు. అంతరార్థాలు, విలువలు వగైరాలాంటి వాటిమీద యిది స్థాపితం అయింది. యీ రెండు ధ్రువాల మధ్యా యెక్కడ్నో మనకి ఒక భావగుచ్ఛం కనిపిస్తుంది. యిది జర్మన్ భావవాద చింతనలో యెంతో పరిపూర్ణంగా అభివృద్ధి చెందింది. యీ దృష్ట్యా సంస్కృతి వస్తుగత మనసు లేదా ఆధ్యాత్మికమైన దానికి సంబంధించి నటువంటిది. మానవ వ్యవస్థల్లో దాని ఆకృతి కనిపిస్తుంది. యిక్కడ సంస్కృతి అనే మాట సంస్కరించడం, అభివృద్ధి చెందడం అనే అసలు అర్థం నిలుపుకుంది. సంస్కృతం, సంస్కరించి నటువంటిది. కొన్ని సందర్భాల్లో దీన్ని నాగరికతతో సారూప్యం చేస్తారు. కొన్ని సందర్భాల్లో వేర్పాటు చేసి చూపిస్తారు. నాగరికతకంటే మరింత గాఢం అయిందిగా చేస్తారు. అయినా సర్వదా మెచ్చుకోలుగానే వాడడం కనిపిస్తుంది.

రెండు రకాలలో దేనితోనూ త్రికరణశుద్ధిగా మమేకం అయిన మార్క్సిస్టులు లేకపోవడం వింతయేమీకాదు. మానవ కార్యాచరణలోని విభిన్న పార్శ్వాలనీ వేర్పాటుచేసి చూసేమేరకు యివి వుండడంవల్ల - అంటే సౌందర్యశాస్త్ర సృష్టికి విడి విభాగం, భావాలకి లేదా విలువలకు సంబంధించి విడి విభాగం వాటి వాటి అంతర్గత తర్కంతో వుండే మేరకన్న మాట. కాని సంస్కృతి గురించిన భావన, అది మార్క్సిస్టుది కానీయండి, మార్క్సేతరమైంది కానీయండి, యీ వేర్పాటులని విచ్ఛిన్నంచేసే ప్రయత్నాన్నీ వ్యక్తం చెయ్యగలదు. మార్క్సిస్టు చింతనలో మానవ కార్యాచరణకు సంబంధించి భావాలకీ, యితర పార్శ్వాలకీ, పరిస్థితులకీ మధ్య వున్న అంతస్సంబంధాన్ని వివరించే భౌతికవాద దృక్కోణాన్నీ అభివృద్ధి చేసే ప్రయత్నం కనిపిస్తుంది. మార్క్స్ పెట్టుబడి మొదటి సంపుటంలో "అధమశ్రేణి శిల్పి" కీ "అత్యుత్తమ తేనెటీగ" కీ మధ్య విభేదం చెప్పిన సందర్భం వుంది. శిల్పి యెంత అధమశ్రేణివాడైనా తన నిర్మాణం గురించి ముందే ప్రణాళిక వేసుకుంటాడని ఆయన అన్నాడు. యిదుగో, యిదే విస్తృత అర్థంలో సంస్కృతి అన్న విషయం.

వేరే రకంగా చెప్పాలీ అంటే, చైతన్యయుతమైన అస్తిత్వం అన్న అ ంలో చైతన్యం అన్న భావన సంస్కృతి అన్నదాని భావనలో గుండెకాయలాంటిది. యీ భావనలో చైతన్యం అనేది ప్రకృతంలో వున్న పరిస్థితులతోనూ, వాటిని మార్చాలన్న దారి చూపించే నియమంతోనూ అనుసంధించుకుని వుంది. మార్క్సిజం ముతకరూపంలో యిది సంస్కృతి గురించిన ద్వంద్వ భావనకు దారితీస్తుంది. ఒక విరోధాభాసగా ఆర్థిక పునాది ప్రతిఫలనంగానూ కనిపిస్తుంది, వర్గపోరాటంలో ప్రచార సాధనంగానూ కనిపిస్తుంది. దీన్ని జ్ఞానసిద్ధాంతంలో చిక్కుపెట్టే "ప్రతిఫలన" (యీ సిద్ధాంతంలో జ్ఞానం స్వతంత్రంగా అస్తిత్వంలో వున్న వాస్తవికత సాదా ప్రతిఫలనంగా కనిపిస్తుంది.) ఒక పక్క వాస్తవిక సౌందర్యంతో సహజీవనం ద్వారా ఉదహరించవచ్చు. మరోపక్క బౌద్ధిక ఉత్పత్తి ప్రయోజనాత్మకంగా వుండాలన్న భావన. యిది పాక్షికత్వం వహించాలన్న సుగుణాన్ని నొక్కి చెపుతుంది (ధర్మపక్షానికి).

రష్యన్ విప్లవ పరిస్థితుల్లో యీ ప్రయోజన దృష్టి లెనిన్ విప్లవ సాంస్కృతిక విప్లవ భావనలో కేంద్రస్థానంలో వుంది. అందులో ఆశ్చర్యం లేదు. నూతన శ్రామికవర్గ సంస్కృతిని సృష్టించే లక్ష్యంతో "ప్రొలెకుల్త్"కి (శ్రామిక సంస్కృతి) వ్యతిరేకంగా ఆయనకీ ట్రాటేస్కీకి జరిగిన సంవాదంలో యిది ముఖ్యాంశం. "ప్రొలెకుల్త్" నిస్సందేహంగా పక్షపాతంతోనే వుంది. కాని లెనిన్, ట్రాట్స్కీ అసందర్భం, ప్రతికూలం అని భావించిన దారుల్లో వుంది. సోషలిస్టు సంస్కృతి ఆవిర్భావం దీర్ఘకాలం పడుతుందన్నది వాళ్ళ దృష్టి. ఒక నూతన సోషలిస్టు మేధావివర్గం ఆవిర్భవించినప్పుడు, విద్య, అక్షరాస్యతలు విస్తరించినప్పుడు దానికి పునాదులు పడతాయి. యీ నూతన సోషలిస్టు మేధావివర్గం బూర్జువా సంస్కృతిలో విలువైనదాన్ని గ్రహించి, పాదుకొల్పుతుంది (పని నిర్వహణ విషయంలో మరింతగా పురోగమించిన పద్ధతుల్ని, ఉదాహరణకు టేలరిజం లాంటి వాటిని గ్రహించినట్టే). సాంస్కృతిక విప్లవ భావనను 1950లలో జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్, తదితర సోషలిస్టు దేశాలు అందుకున్నాయి. అయితే 1960లలో చైనాలో చెలరేగిన సాంస్కృతిక విప్లవం బూర్జువా సంస్కృతి మీద దాడి చేసింది. అదీ యెలాగంటే లెనిన్ సంవాదన గురిపెట్టిన తీవ్రవాదుల తరహాలో.

సౌందర్య సంబంధి విషయాల్లో లెనిన్ దృష్టి సంప్రదాయకంగానే వున్నా, ఆయనకు వున్న సాంస్కృతిక విప్లవభావన సంస్కృతి గురించి విశాల భావనకు పథ నిర్దేశం చేసిందని చెప్పాలి. యివాళ అది చర్చల్లో ప్రముఖంగా వుంది. (సోవియట్ యూనియన్ వున్నప్పుడు సంస్కృతి అన్నదాన్ని "జీవితవిధానం"లో అనుసంధించడం వుండేది. తూర్పు జర్మనీలో సంస్కృతిని బట్టి కళలకు మాత్రమేగాక, సోషలిస్టు సంస్కృతి అంశాల్లో "భౌతిక సంస్కృతి", క్రీడలు, పర్యాటకం అని కూడా వుండేది.)

పాశ్చాత్య మార్క్సిజం లూకాక్స్, గ్రామ్స్కీలతో మొదలైందని చెప్పచ్చు. యిది ఖాయంగా ఒక సంప్రదాయానికి ఆరంభం. సంస్కృతి విషయాలని యెంతగానో తరచి చూసిన సంప్రదాయం అది. యీ రంగంలో తరవాత తరవాత జరిగిన కృషికి యీ ఉభయులూ ఆద్యులు. ల్యూకాక్స్ జర్మన్ నయా - కాంటియన్ శాఖలో తరిఫీదు అయినవాడు. 1920లో ఆయన "పాత - కొత్త సంస్కృతి" అన్న వ్యాసం రాశాడు. సాధారణంగా యీ సంప్రదాయం నుంచీ, ప్రత్యేకంగా సిమ్మెల్ నుంచీ గ్రహించి సంస్కృతి గురించిన భావనను మార్క్సిస్టు ధోరణిలో తిరిగి రూపొందించినటువంటిది. లూకాక్స్, సంస్కృతి, నాగరికత నుంచి విభేదిస్తుందని చెప్పేడు. "విలువైన ఉత్పత్తుల, సామర్థ్యాల మేళవింపు. జీవిత తక్షణ పోషణ విషయానికొస్తే అవసరం లేనివే. ఉదాహరణకు యింటికి వుండే బాహ్య సౌందర్యం, లోపలి సౌందర్యం తీసుకోండి... దాని మన్నిక, భద్రతలని బట్టి దీన్ని చూడండి" అని సంస్కృతిని ల్యూకాక్స్ విశ్లేషించాడు. యీ అర్థంలో సంస్కృతిని పెట్టుబడిదారీ ఉత్పత్తి మార్కెట్ కోసం నాశనం చేస్తుంది. "సంస్కృతికి సామాజిక పూర్వనిబంధన మానవుడే లక్ష్యం కావడం"తో, సంస్కృతి భవిష్యత్తు యిలా వుంటుందని ప్రస్తుతం చెప్పలేని స్థితి వుండడంతో, నూతన సంస్కృతి సోషలిజంలోనే సాధ్యం. ల్యూకాక్స్ తర్వాత రచన యెక్కువగా సౌందర్యశాస్త్రానికే అంకితం అయింది. "హిస్టరీ అండ్ క్లాస్ కాన్షస్‌నెస్" అన్న గ్రంథం బూర్జువా యూరప్‌లో పదార్థీకరించిన ఆలోచనా రూపాలకు వ్యతిరేకంగా శ్రామికవర్గ ప్రపంచ దృక్పథాన్ని అభివృద్ధి చెయ్యడం గురించి తరచి చూస్తుంది.

సామాజికశాస్త్ర సాహిత్యం, భావాల చరిత్ర గురించి గోల్డ్‌మాన్ చేసిన కృషికి ల్యూకాక్స్ తొలి రచనలు పునాది అయేయి. ఫ్రాంక్‌ఫర్ట్‌శాఖ విమర్శనాత్మక సిద్ధాంతం మీద కీలకమైన ప్రభావాల్లో ఆయన ప్రభావం కూడా ఒకటి. యీ సందర్భంలో కేంద్ర బిందువులుగా వున్నవాళ్ళు అడార్నో, హార్క్‌హేమర్, మార్క్యూస్‌లు. అడార్నో బెంజమిన్‌తో ముఖ్యమైన కార్యకలాపాల్లో నిమగ్నమయేడు. ఆయన సోషల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌తోనూ. బ్రెఖ్టోనూ ఓ మాదిరిగా మాత్రమే సంబంధాలు పెట్టుకున్నాడు. అడార్నో సౌందర్యశాస్త్రం చాలా బాగా అభివృద్ధి చెందింది. కానైతే ఆయన హర్క్‌హీమర్, మార్క్యూస్‌లకి సంస్కృతి విషయంలో వున్న విశాల భావనలో భాగస్వామి. యీ భావన "ద ఫ్యూచర్ ఆఫ్ యాన్ ఇల్యూజన్" "సివిలైజేషన్ అండ్ ఇట్స్ డిస్‌కంటెంట్స్" అన్న గ్రంథాల్లో ఫ్రాయిడ్ యీ పదాన్ని వాడిన తీరుకే యిది యెక్కువ రుణపడివుంది. దీనికి సూచకంగా "ఆన్ ది ఎఫ్ఫర్‌మేటివ్ కాన్సెప్ట్ ఆఫ్ కల్చర్" అన్న వ్యాసంలో మార్క్యూస్ సూత్రీకరణ కనిపిస్తుంది:

సంస్కృతి గురించి ఒక సాధారణ భావన వుంది... సమాజపు చారిత్రక క్రమంలో మనసు అంతరార్థాన్ని అది వెల్లడిచేస్తుంది. ఓ ఫలానా సన్నివేశంలో సామాజిక జీవిత సమాహారాన్ని అది ప్రముఖం చేస్తుంది. భావకల్పన పునరుత్పత్తి రంగమూ (సంస్కృతి గురించిన పరిమిత అర్థం, ఆధ్యాత్మిక ప్రపంచం) పాదార్థిక పునరుత్పత్తి (నాగరికత) రంగమూ రెండూ చారిత్రకంగా ప్రత్యేకించి చూపగల, సర్వగ్రాసి ఏకతను రూపొందిస్తాయి. (1968)

ఈ అర్థంలో చూస్తే సంస్కృతి అనేదాన్ని వ్యస్తంగా చూడడం వుండదు. "దానికిగా దాన్ని" బోధపరచుకోవడం వుండదు. అలాగని అది స్వతంత్ర అస్తిత్వంలో వున్న దాన్ని ఒట్టినే ప్రతిఫలించడమూ అవదు. సౌందర్య రంగంలో

> విమర్శ కర్తవ్యం సాంస్కృతిక దృగ్విషయాన్ని ఆపాదించగల ఫలానా ప్రయోజనాసక్తి బృందాలని అన్వేషించడంగా వుండకూడదు. యీ దృగ్విషయాలలో వ్యక్తమైన సామాన్య సాంఘిక ధోరణుల్ని కనిపెట్టి అధ్యయనం చెయ్యడంగా వుండాలి. వేటిద్వారా ఆ బలమైన ప్రయోజనాలు సాధించ

వీలవుతాయో చూడాలి. సాంస్కృతిక విమర్శ అనేది సామాజిక లక్షణాకృతుల్ని తెలియచేసేదిగా వుండాలి.

"సరకుల ఆరాధన" తీరులో, (ముఖ్యంగా అడార్నో చెప్పినట్టు) పదార్థీకరణ తీరులో సంస్కృతిని విశ్లేషించడం రెండు ప్రధాన రూపాల్లో కనిపించింది. మొదటిది, మార్క్యూస్ చెప్పినట్టు, "రూఢి సంస్కృతి". బూర్జువా ప్రపంచంలో రూఢి సంస్కృతి మార్క్స్ మతం గురించి చెప్పినట్టుగా వుంటుంది. "పీడిత జీవుల నిట్టూర్పు. హృదయంలేని లోకపు హృదయం. ఆత్మరాహిత్య పరిస్థితుల ఆత్మ. అది ప్రజల పాలిట మత్తుమందు." (క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ రైట్", పరిచయం). మార్క్యూస్ చెప్పినట్టు

> రూఢి సంస్కృతి అంటే అర్థం, బూర్జువా యుగంనాటి సంస్కృతి. అది తన పరిణామంలో నాగరికత నుంచి మానసిక, ఆధ్యాత్మిక లోకాన్ని స్వతంత్రంగా విలువ సంతరించుకున్నట్టు ఏర్పాటు చెయ్యడం. యీ విలువ నాగరికతకంటే ఆధిక్యం కలిగినటువంటిది. దీని నిర్ణాయక విశిష్ట లక్షణం యేమిటంటే సార్వత్రికంగా విధాయకమైన, చిరస్థాయిగా మెరుగైన, మరింత విలువైన ప్రపంచాన్ని దృఢపరచడం: యీ ప్రపంచం నిత్యం జీవసంభరణ భయంతో కొట్టుమిట్టాడే వాస్తవ ప్రపంచంకంటే భిన్నమైంది. కాని ప్రతివ్యక్తీ "తన అంతరంగంలో" దీన్ని సాధించుకోగలదు. యదార్థ పరిస్థితికి సంబంధించి యే పరివర్తన చేసుకోకుండానే.

ఆ రకంగా సంస్కృతికి, ముఖ్యంగా కళకి, ఒక అస్పష్టపాత్ర వుంది: స్వేచ్ఛ, ఆనందం అన్న కోరికల్ని అది నిలబెడుతుంది. ఆధునిక సమాజాల్లో వీటికి గండిపడింది. కాని వాటిని భ్రమాన్విత పరిధిలోకి విసిరేస్తుంది. ఆ రకంగా "తిరుగుబాటు కోరికను నిద్ర పుచ్చడం" ద్వారా యధాతథ స్థితిని రూఢిచేస్తుంది. తరవాత అడార్నో వాదించినట్టు, సంస్కృతి భావన పరిపాలనతో ముడిపడివుంది.

కాని బూర్జువా సంస్కృతి కనీసం యిలా ఒక తరహా భౌతికాతీతను నిలబెట్టినా, అది "సంస్కృతి పరిశ్రమ"లో లుప్తం

అయింది. దీని గురించి అడార్నో, హార్క్‌హీమర్ "డయలెక్టిక్ ఆఫ్ ఎన్‌లైటెన్‌మెంట్" విశ్లేషించారు. యిక్కడ సరకు సూత్రాన్ని కడకంటా సాగదీశారు. అది సౌందర్యపర ఉత్పత్తికే కాదు, వ్యక్తిత్వ పరిధికి కూడా. "మిలమిలలాడే దంత శోభకంటే, శారీరక వాసనల నుంచి, ఉద్రిక్తతల నుంచీ స్వేచ్ఛకంటే మరేమీ సూచించదు". "ఉన్నత సంస్కృతి" "పాదార్థిక సంస్కృతి"గా పతనమవడం "సంస్కృతి సరుకుమయం కావడం" క్రమంగా మార్కూస్ భావించాడు. యీ క్రమంలో ఉన్నతమైన సంస్కృతి తన విమర్శనాత్మక సత్తాని పోగొట్టుకుంటుంది. సంస్కృతి, లైంగికమైందాని లాగానే, మరింతగా అందుబాటులోకి వస్తుంది. కానైతే "రూపంలో పతనమై" యిలాంటి పరిస్థితి గురించి అతి తీవ్రమైన విమర్శ కూడా వూరికే మరొక సరుకుగా పుంజుకుంటుంది. మార్కూస్ "వన్ డైమెన్షనల్ మేన్" వ్యాపారపరంగా విజయం సాధించింది. త్రికరణశుద్ధిగా ప్రత్యామ్నాయ సంస్కృతిని నిర్మించడానికి జరిపిన యే ప్రయత్నమేనా యేదో గడ్డిపరకల్ని పట్టుకోవడంగానే కనిపిస్తోంది (అలాంటి అవకాశాల గురించి అడార్నో కంటే హార్క్‌హీమర్ కంటే మార్కూస్ మరింత ఆశావహంగా వుండేవాడు).

విమర్శ సిద్ధాంతంలో రెండవ తరానికి చెందిన వాళ్ళల్లో ప్రముఖుడు హబెర్‌మాస్. ఆయన సాంస్కృతిక సమస్యల పట్ల చాలా తక్కువ దృష్టిపెట్టాడు. కాని ఆయన ఆధునిక నాగరికతలో న్యాయ సమ్మతమైన దాని గురించిన విశ్లేషణలో యీ అంశాన్ని రానురాను పరిశీలిస్తూ వచ్చాడు. సాంస్కృతిక ఆధునికత భావనను రూపొందించాడు. యిందులో తార్కిక సహితమైన సామాజిక క్రమాలు వాటికి లొంగి వుండేవాళ్ళ సాధారణ అవగాహననుంచి క్రమేపీ వెనక్కిపోతున్నాయి. అంతకు ముందటి విమర్శ సిద్ధాంతవేత్తలు గుర్తించిన క్రమాల గురించి మరింత సామాన్యమైన, బలమైన విశ్లేషణ యీ పద్ధతి ద్వారా అందవచ్చు.

సాంస్కృతిక విమర్శ జర్మన్ సంప్రదాయపు మార్క్సిస్టు పునర్నిర్మాణంలో లూకాక్స్ ప్రభావం తాలూకు స్పష్టమైన ధార యిలా వుంది. అటు పక్క సోషలిస్టు రాజకీయాల సాంస్కృతిక పార్శ్వం మీద గ్రామ్‌స్కీ నొక్కి చెప్పడం వుంది. ఆ రాజకీయాలు బూర్జువా వర్గం

పెత్తందారీ ఆధిపత్యంకంటే తక్కువ బలప్రయోగంతో పాలించే సమాజాల్లో వున్నాయి. అక్కడ యిది కీలకంగా వుంది. మరింత విస్తరించుకుని వుంది. యీ సాంస్కృతిక పార్శ్వం రేమండ్ విలియమ్స్, ఆల్తూస్సర్‌లాంటి విభిన్న సమకాలీన మార్క్సిస్టులకు అలా వుంది. సంస్కృతి మీద లగ్నం కావడం బ్రిటన్లో స్పష్టంగా వుంది. విలియమ్స్ రచనల్లోనూ, చరిత్రకారుడు ఎడ్వర్డ్ థాంప్సన్ కృషిలోనూ యిలా కనిపిస్తుంది. అలాగే రిచర్డ్ హోగార్ట్ స్థాపించిన సమకాలీన సాంస్కృతిక అధ్యయనాల బర్మింగ్‌హామ్ సెంటర్‌లోనూ కనిపిస్తుంది. ఫ్రెంచి స్ట్రక్చరలిజమ్ ఆధారంగా యీ వైఖరిని విమర్శించేవాళ్ళు కూడా నిర్మాణాతీత దృగ్విషయంతో సమానమైన - వేరే రకంగా రూపొందించినా - పట్టింపు ప్రదర్శిస్తూ వున్నారు. (ఈగల్‌టన్, జాన్సన్, బారెట్ మొదలైన). ఫ్రాన్స్‌లో పీరెట్ బోర్డ్, ఆయన సహచరుల ముఖ్య కృషిలోనూ యిది సత్యమే. రాజకీయాల్లోను, విద్యా వ్యవస్థలోనూ వర్గసంబంధాల పుట్టుపూర్వోత్తరాల తీగలాగడానికి ప్రతీకాత్మక, సాంస్కృతిక ముడిసరుకు భావాలని వాడడం కనిపిస్తుంది. అలాగే మరింత సంకుచిత అర్థంలో "సాంస్కృతిక వినిమయాన్ని" గురించీనీ (బోర్డో, పాస్సెరాన్ 1970, బోర్డో 1979). సామ్రాజ్యవాదం కూడా ఆర్థిక, సైనిక పరిణామంలాగానే సాంస్కృతికంగా వుండడమూ కనిపిస్తుంది. యిక్కడ అభివృద్ధి చెందిన దేశాలు అక్షరాలా టెలివిజన్ మీద, పుస్తకం మీద, పత్రికల మీద, వార్తా సంస్థల మీద గుత్తాధిపత్యం కలిగివుంటాయి. వార్తల ప్రయోగం ఒక క్రమంలో వున్న ఒక అంశం మాత్రమే. యిందులో తృతీయ ప్రపంచదేశాల్ని "పాశ్చాత్య వ్యాపార నాగరికత"కు గురిచెయ్యడం, దాని ఉత్పత్తి రంగాన్ని వెల్లడిచెయ్యడం, ఒక వినిమయ సంస్కృతికి గాలం అందించడం వుంటాయి. తద్వారా వనరుల్ని పక్కకు మళ్ళించడం జరుగుతుంది.

ఉపరితల నిర్మాణాలతో ఏకపక్షంగా తలమునకలై పోవడంలాంటి దాన్ని పాశ్చాత్య మార్క్సిజం యెంతకాలం నిలుపుకుంటుందో చూడాలి, అది సంస్కృతికి సంబంధించి కానీయండి, భావజాలానికి సంబంధించి కానీయండి లేదా ప్రాధాన్యం విషయంలోగాని ప్రాతినిధ్యం విషయంలో గానీయండి. యేమైనా రానురాను ఒక విషయం తేటతెల్లమవుతోంది.

అది ఉత్పత్తికీ పునరుత్పత్తికీ మధ్య వున్న అంతస్సంబంధం గురించిన యెరుక (ఓ రకంగా యిది స్త్రీవాదం వల్ల కావచ్చు). బహుశా మార్క్సిస్టులు సంస్కృతి గురించి ప్రత్యేక నైరూప్య పద్ధతిలో ఆలోచించడం తగ్గించి సాంస్కృతిక ఉత్పత్తి, పునరుత్పత్తి అనేవి ప్రస్తుతం అస్తిత్వంలో వున్న ఉత్పత్తి విధానాలలో యెలా సంక్లిష్ట యంత్రాంగంతో వున్నాయో చూసేటట్టు మరింత ఆలోచన చెయ్యడం సంభావ్యంగా కనిపిస్తుంది.

# సాహిత్యం

సాహిత్యం గురించి మార్క్స్, ఎంగెల్స్‌లకి వున్న భావాలే వాళ్ళ సౌందర్యశాస్త్ర అభిప్రాయాల్ని రూపొందించాయి. అవే ఆధిపత్యం వహించాయి (సాహిత్యం గురించి చెప్పడంలో నాటకాలూ కలిసే వున్నాయి). ఇతర కళలు వాళ్ళ దృష్టిని అంతగా ఆకట్టుకోలేదు. వాళ్ళ ఆలోచనలు, అభిప్రాయాలు, సందర్భవశాత్తూ చేసిన వ్యాఖ్యలు అధికభాగం వాళ్ళ వాళ్ళ జాబుల్లో వున్నాయి. యివన్నీ నిశితమైన, సొంత ముద్ర వున్న సాహిత్య సిద్ధాంతపరమైనవే (ఆ రకంగా విమర్శ పరమైనవి కూడాను). అయితే యీ మార్క్సిస్టు భావాలు ఒక సర్వ సమగ్రమైన ప్రామాణిక మార్క్సిస్టు సాహిత్యం కావు. అవి ప్రధానంగా వున్న మొగ్గులో, సాంప్రదాయికంగా "వస్తువు" అని పిలిచే దాని వేపు వుంటూ, రూపంతోకంటే, స్వయం సంపూర్ణమూ కాదు. అదీగాక తరవాత వచ్చిన మార్క్సిస్టులు, యెక్కువగా ఉత్తేజకరంగా వుండేదే అయినా, సాహిత్య విమర్శలో దారుణమైన సంప్రదాయాన్ని అందించారు. యేమంటే వాళ్ళ భాష్యాలు ఆనాడు చలామణీలో వున్న భావజాల ధోరణుల వల్లనో, మార్క్స్, ఎంగెల్స్‌లు సాహిత్య అధ్యయనానికి స్థిరమైన పునాది యేర్పాటు చేసిన తీరు గ్రహించలేని అజ్ఞానం వల్లనో ఆ తీరులో శ్రుతి అయ్యాయి. (యీ విషయం గురించి మార్క్స్, ఏంగెల్స్‌ల అభిప్రాయాల్ని వాళ్ళ రచనల నుంచి యేర్చి కూర్చిన సంకలనం 1933 దాకా రాలేదు. దాన్ని లిఫ్‌షిట్జ్, ఎఫ్.పి. ష్లిలర్ కూర్చేరు, 1945 దాకా దాన్ని పెద్దగా వాడుకోవడమూ జరగలేదు). మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతం గురించి రెండు గణనీయమైన యత్నాలు మొదట్లో మెహ్రైంగ్, (1893), ప్లెహనోవ్ (1912) చేశారు. అయినా ఏంగెల్స్ కీర్తిశేషుడైన

తరవాత అర్ధ శతాబ్దందాకా, అనేక రకాల యితివృత్తాలని ఒక క్రమపద్ధతిలో విపులీకరించి సాహిత్యంలో మార్క్సిస్టు అధ్యయనాలకి సంబంధించిన చట్రాన్ని అందించే ప్రయత్నాలు జరగలేదు.

ఈ రంగంలో తరవాతి తరం మార్క్సిస్టు రచయితలు నొక్కి చెప్పిన విలువలు, క్లుప్తంగా చెప్పాలంటే, వాస్తవికతను ప్రదర్శించడం అని నిర్వచించవచ్చు. చరిత్ర గురించి మార్క్సిస్టు సిద్ధాంత విశ్లేషణ పునాది అధ్యయనంలో గతితార్కిక, భౌతికవాద పద్ధతి. ఆ రకంగా మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతాన్ని, విమర్శనీ ఒట్టి నైతిక తీర్మానాలకే కుదించలేం. రాజకీయ స్తోత్రాల సంగతీ, శాపనార్థాల సంగతీ సరేసరి. యీ దృష్ట్యా సాహిత్య అధ్యయనాలు నైతిక, ప్రవర్తనాత్మక పునర్ మూల్యాంకనాలతో, నిర్ణయాలతో కలిసే వుంటాయి. కానైతే అవబోధ, విశ్లేషణ ప్రయోజనాల కోసం (సాహిత్య) వాస్తవాన్ని గ్రహించడం తరవాతే అవి వస్తాయి. మార్క్సిస్టులకు ప్రధాన విషయాలు యేమిటీ అంటే వర్గాలు, తుల్యాంకనాలు వాస్తవిక రచన పద్ధతులు, గ్రహించడాలు, సాహిత్య అనుభవ పరాయీకరణ/అపరాయీకరణ.

వర్గతుల్యాంకనాలు:

రచనలో వాస్తవాన్ని ప్రతిబింబిస్తూ, సాంఘికవర్గం రీత్యా, ముఖ్యమైన అంశాల్ని వేర్పాటు చెయ్యడం మార్క్సుకి ముందే మొదలైంది. మేడమ్ ద స్థాయిల్ యీ ధోరణి ప్రవేశపెట్టినట్టు తెలుస్తోంది. పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం ఆవిర్భవించింది. పేదపట్టణ శ్రామికవర్గం వచ్చింది. ప్రధాన సామాజిక బృందంగా రైతాంగం పోయింది. దాంతో సాహిత్యకారులు, విమర్శకులు సాంఘిక నిర్మాణాలు సాపేక్షంగా అస్థిరత్వానికి గురవడం గమనించారు. భవిష్యత్ సమాజ నిర్మాణంలో వర్గ "నీతి" పాత్ర గుర్తించారు. రాజకీయాల పాత్ర గుర్తించారు. మార్క్సు యువ హెగెలియన్ల తరంలోవాడే కదా. ఆ తరంవాళ్ళు జర్మనీలో సాంఘిక జీవితంలోని సంఘటనల్ని గ్రహించారు. సాహిత్య ప్రతిఫలనంలోనూ వాటిని గ్రహించారు. అవి చారిత్రకం, అస్థిరం. అసలు మార్క్సు మొదట ధగద్ధగాయమాన కాల్పనిక కవి కావాలని సంకల్పించాడు. తూర్పారబట్టే విమర్శకుడు కావాలనుకున్నాడు

అతని మిత్రులైన ఇ.టి.ఎ. హాఫ్‌మన్, హైన్‌రిక్‌హేనె, ఎఫ్. ఫ్రీలిగ్రాత్‌ల్లాగా. కాని ఆ గమ్యానికి నీళ్ళు వదిలేశాడు - యేమంటే తాత్విక, సామాజిక చింతనలో, రాజకీయ పత్రికారచనలో ఆవిర్భవిస్తూ వున్న అంతర్జాతీయ శ్రామికవర్గ ఉద్యమంలో ప్రముఖ వ్యక్తి కావడంలో మునిగిపోవడం వల్ల.

శ్రామికవర్గం "వాస్తవంలోనే భావంగా" ఆవిష్కరించుకున్న (తొలి 1840లలో) నాటి నుంచీ మార్క్సు చింతనలో వర్గం ఒక కీలక అంశం అయింది. ఆ వర్గం ప్రభావం కలిగించే సాహిత్య రచనలో గ్రాహ్యతలో విలువల సముదాయం వేపు మార్క్సిస్టు సాహిత్య చింతన విధాయకంగా మళ్ళింది. యీ విషయం ప్రవర్ధమానంగా ఆవిర్భవించిందిగా గమనించాలి. ప్రత్యేక సాహిత్య రచనలని అనేకమంది విమర్శకులు లోతుగా పరిశీలించడంద్వారా, అలాగే బయటపడిన స్ఖాలిత్యాల ద్వారా యిది ప్రవర్ధమానం అయిందని గ్రహించాలి. నిజానికి సాహిత్య వర్గ విశ్లేషణ భావన - వర్గ తుల్యాంకనాలన్నది - మార్క్సు, ఎంగెల్సులు అందించలేదు. ప్లెహనోవ్ అందించాడు. ఆయనా, మెహ్రింగ్ తొలి మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతవేత్తలు అని చెప్పాలి.

వర్గ తుల్యాంకనం అన్న భావనను సాహిత్యాకృతిలో అనేక అన్యోన్యాశ్రితాలకి వర్తింప చెయ్యవచ్చు. రాజకీయ అభిప్రాయాల్ని వెల్లడిగా ప్రకటించడం దగ్గర్నుంచి (వర్గ అనుబంధాలకి కొంచెం యించుమించులో సంబంధించినవి) మార్క్సు సమ్మతి పూర్వకంగా చెప్పినట్టూ "మహత్తర చారిత్రక అర్థంలో పార్టీలోకి" చేర్చుకోవడం దాకా. యీ అర్థం యేమిటంటే మానవాళి పురోగామి ఉద్యమం అని. మొదటి అంశం యెక్కువగా యువహెగెలియస్లు టెండెజ్ (Tendez) అని పిలిచేదాంట్లో వుంది. రెండవది మార్క్సు, ఫ్రీలిగ్రత్‌కి 29 ఫిబ్రవరి 1860న రాసిన ఉత్తరంలో వుంది. అయితే యెంతమంది రచయితలు స్వప్రయోజనం నుంచి (వర్గ ప్రయోజనం) నిజమైన సార్వజనీన సాహిత్య అనుభూతికి లంఘన చెయ్యగల సమర్థులు అన్న విషయంలో మార్క్సుకి సందేహం వుండింది. కాని అలాంటిది కనిపించినప్పుడు, బాల్జాక్ నవలల్లో లాగా (బాల్జాక్ రాచరిక సూత్రాలకి విధేయుణ్ణనే వెల్లడించుకున్నప్పటికీ) మార్క్సు దానికి చేతులెత్తి అభినందనలు

తెలియచేశాడు. మరో పక్క సమానత్వం సౌభ్రాతృత్వం అంటూ నినదిస్తూ వున్నప్పటికీ తమ వర్గమూలాల ప్రభావం నుంచీ, స్థానాల ప్రభావం నుంచీ బయటపడలేని సోషలిస్టు లేదా అతివాద రచయితల్ని కూడా (లేదా ముఖ్యంగా) హేళన చేశాడు. ఆయన యెత్తి పొడుపులకు తొలిగా గురైనవాడు యూజినె స్యూ. (దహోలీ ఫేమిటీ, అధ్యాయం v.)

సాహిత్యంలో వర్గసంబంధాల విశ్లేషణ తరవాతి మార్క్సిస్టుల్లో చాలా వైవిధ్యంగా వుంది. వర్గ పోరాటాన్ని నొక్కి చెప్పిన బాఖ్తిన్ రాడికల్ హ్యూమనిజం నుంచి (1929, 1965) గోల్డ్‌మాన్ జెనెటిక్ స్ట్రక్చరలిజం దాకా (genetic structuralism). గోల్డ్‌మాన్ రచనలు సాహిత్యాన్ని ఒక వర్గం వెల్లడిచేసిన "ప్రపంచ దృక్పథ" దృక్కోణాన్ని పరిశీలిస్తాయి. సాహిత్యం గురించి లెనిన్ రాసింది తక్కువే. అవి కథావిశ్లేషణ మీద ఆధారపడినవి. దీన్ని యీ రచనలు మొత్తంగా అధిగమించాయి. అలాగే 1930లలో బోల్షెవిక్ సాహిత్య విమర్శలో విస్తరించుకున్న "మొరటు" విశ్లేషణలనీ అధిగమించాయి. యీ విశ్లేషణల్లో రచయిత వర్గ పుట్టుపూర్వోత్తరాలు సంపూర్తిగా శాశ్వతంగా అతని వైఖరినీ, ప్రయోజనాల్నీ నిర్ణయించేసినట్టు చూపించేవారు. యీ బాపతు విశ్లేషణ "వర్గతుల్యాంకనాల" భావనను వక్రీకరిస్తుంది, ముద్రవేసేసే సాదా క్రమానికి దారితీస్తుంది. యీ బాపతు ధోరణి సోవియట్ విమర్శకుడు వి. ఫ్రిఖె ఉదాహరణ ప్రాయం చేశాడు. అయితే, యిటీవలి కాలంలో సార్త్ర్ దీన్ని విముక్తం చేశాడు, పూర్తిగా భిన్న సందర్భంలోనైనా, ఫ్లాబర్ట్ వర్గబోధన గురించి ఆయన చేసిన విస్తృత అధ్యయనంలో అలా చేశాడు. స్ఫూర్తి గల విమర్శకుల చేతిలో, "వస్తువు" విలువలు రచనలోనే ముఖ్యంగా ప్రయోజనంతో వుంటాయని చెప్పడం అవసరంలేదు. సాహిత్యంగా అది సాధించిన విజయంవల్ల పాఠకులకు యెలాగైనా ఆదరణీయంగానే వుంటాయి.

**వాస్తవ పద్ధతి:**

రచనలో కథనాత్మక అవకాశాలలో సాంఘిక వర్గాల చిత్రణకు సంబంధించి మార్క్స్, ఎంగెల్స్‌లు చేసిన స్థిరమైన సూత్రీకరణలు పటువైన పునాదినే యేర్పాటు చేశాయి. యిక్కడ నయా హెగెలియన్ల

భావన అయిన "సంకేత చిహ్నం" కేంద్రంగా వుంటుంది. లాసాలే "ఫ్రాంజ్ నాన్ సిక్కింగెన్" అన్న చారిత్రక నాటకం రాశాడు. దాన్ని కూర్చడంలో లాసాలే అనుసరించిన సాహిత్య పద్ధతి గురించి మార్క్స్, ఎంగెల్స్‌లు సుదీర్ఘంగా వ్యాఖ్యానించారు. (మార్క్స్ 1859 ఏప్రిల్ 19న రాసిన ఉత్తరం, ఎంగెల్స్ లాసాలేకి 1859 మే 18న రాసిన ఉత్తరం). యివీ, తరవాత ఎంగెల్స్ రాసిన ఉత్తరాలూ కాల్పనిక సాహిత్యంలో చారిత్రక పరిణామాన్ని ప్రతిబింబించడంలో తమ సిద్ధాంతాల్ని ఉద్దేశ్యపూర్వకంగా నిశితం చేశారు. మార్గరెట్ హార్క్‌నెస్ "ఎ సిటి గర్ల్" అన్న నవల రాశారు. ఆ నవల గురించి ఆమెకు ఎంగెల్స్ 1888 ఏప్రిల్‌లో యిలా రాశాడు: "నేను యేదన్నా వ్యాఖ్య చెయ్యాలీ అంటే అది ఒకటే - మీ నవల అంత వాస్తవికంగా లేదు అని. వాస్తవికత అంటే నా దృష్టిలో, వివరాలకి విధేయంగా వుండడంతోబాటుగా, ఆ విలక్షణ పరిస్థితుల్లో విలక్షణ పాత్రల్ని విధేయంగా చిత్రించడం". యీ మాటలకు టీకలాగా సాహిత్యంలో వాస్తవికత గురించి ల్యూకాక్స్ చేసిన అధ్యయనాలు వుంటాయి, కొంచెం పరిమితుల్లో వున్నా, అవి ముఖ్యమైనవే.

సాహిత్య వాస్తవికత గురించి మార్క్సిస్టు భావన అన్వేషించడం యీ మాటలతోనే మొదలైంది. యిది కాల్పనిక సాహిత్య రచనలాగానే చరిత్ర గురించిన రచనకీ అంతే వర్తిస్తుంది (యింకా చెప్తే మరింతగా). కల్పనాశక్తితో నిండిపోయిన హాఫ్‌మన్, బాల్జాక్‌ల కథల్ని మార్క్స్ మెచ్చుకున్నాడు. కథనాత్మక చిత్రణలో, యే యిబ్బందీ లేకుండా "ప్రతిఫలన" సిద్ధాంతాన్ని అనుసరించే మార్క్సిస్టుల రాతల్ని చదివినప్పుడు యీ మెచ్చికోలు వల్ల వచ్చే సమస్యల జాడైనా కనిపించదు. అమెరికన్ ఎల్. ఫ్లైనా (నాట్యం గురించి, ఫ్యూచరిజం గురించీ రాశారు) లాంటి తొలి మార్క్సిస్టు రచయితలు కొన్ని సమస్యల్ని లేవనెత్తారు. 1930లలో సాగిన వాదోపవాదాల్లో బ్రెష్ట్, తదితరులు వాటిని విపులీకరించారు. ఆ తరవాత వాస్తవికత గురించీ, ఆధునికత గురించీ చర్చలు వచ్చాయి. (బ్లాక్ తదితరులు 1977.) చివరకు కాఫ్కా రచనలు సమస్యను తిరుగులేకుండా ప్రతిపాదించినట్టు కనిపించాయి. స్టాలిన్ అనంతర యుగంలో మరింత స్వేచ్ఛ వచ్చినప్పుడు, సంప్రదాయ మార్క్సిస్టు

విమర్శకుల్ని కాఫ్కాను వాస్తవికవాద భ్రష్టులైన ('రెనెగేడ్స్') ఫిషర్, గరాడీ, ఫ్యూయెంటెస్ లాంటి వాళ్ళు సైతం పొగడ్డం చిక్కుపెట్టింది. చాలామంది మార్క్సిస్టు లేదా మార్క్సిస్టు మొగ్గుగల కళాకారులు నిర్నిబంధంగా సింబాలిజం, ఫాంటసీ, సర్రియలిజం, అల్లెగిరి, వైయక్తికవాదం లాంటి ప్రయోగాలు చేశారు. యు. ఎస్. ఎస్. ఆర్.లో నైష్ఠిక సంప్రదాయం వున్న సమయంలో, విదేశాల్లోని మేధావి బృందాల్లో సోవియట్ పాలక పార్టీ ఆధిపత్యంలో వున్న సమయంలో, కమ్యూనిస్టు సంపాదకులు, నిర్ణేతలు సమస్యల్ని లేవనేత్తే తీరు చాలా పక్కదోవ పట్టించేటట్టు వుంది. ఫిల్మ్ నిర్మాతలు, కవులు, నవలాకారులు, చిత్రకారులు, పారిశ్రామిక రూపశిల్పులు, తదితర సృజనాత్మక నిపుణులు సాధించిన విజయాలు, పరికల్పనలు సరిగా తూకం వెయ్యడం జరిగినప్పుడు మాత్రమే వాస్తవిక వాదం గురించిన మార్క్సిస్టు సిద్ధాంత సముచిత చరిత్రను రాయడం జరుగుతుంది. అది మహత్తరమైన, వికాసదాయక కృషి అవుతుంది.

**పరాయీకరణ, అపరాయీకరణ:**

చరిత్ర గురించి మార్క్స్ సిద్ధాంతంలో విషయం వర్గపోరాటం. పరాయీకరణభావం యిందులో ముఖ్యమైన పార్శ్వం. కాల్పనిక సాహిత్యంలో వర్గ తుల్యాంకనాల గ్రహణగా (యితర ముఖ్యాంశాలతోబాటు) ఆరంభమయేది సూక్ష్మగ్రాహ్యత. శిక్షణ వున్న విమర్శకుడినీ, సిద్ధాంతవేత్తనీ యెలా నడిపిస్తాయో చూడాలి. సాంఘిక జీవితంలో సంఘర్షణ, అయోమయం, జాతి నిస్సత్తువ పరిణామాలున్న సాహిత్య రచనలో కల్పిత గాథాపరమైన, రీతిపరమైన లేదా లాంఛన ప్రాయమైన తుల్యాంకనాలకేసి నడిపిస్తాయి. స్యూ (Sue) నవల "ద మిస్టరీస్ ఆఫ్ పారిస్"లో సామాన్యంగా మానవజాతి ప్రతీకగా ఉద్దేశించిన నాయికపాత్ర గురించి మార్క్స్ అలా చెప్పేడు. ఆమె ఆ నవలా రచయిత్రి సంకుచిత దృక్పథాన్ని, అనుభవాన్నీ వెల్లడిచేస్తోందన్నాడు.

ఆయన మరింత స్థూలంగా యింకోమాట చెప్పేడు. పారిశ్రామిక యుగం సృజనాత్మక కల్పనలో దారిద్ర్యాన్ని సృష్టించిందన్నాడు – ప్రాచీన గ్రీకుల పురాణాలు, సౌందర్యాత్మక సమతౌల్యం యిక కనిపించవు – అదే

విధంగా పెట్టుబడిదారీ విధానంలోని ఆధిపత్య సామాజిక వర్గం పాత్రలు ఐహిక భోగలాలసతతో కొట్టుకుపోతాయి. పునరుజ్జీవన కాలంలో పాలకవర్గం యెంత గొప్పగానో భావించిన లక్షణాలు లుప్తం అయిపోతాయి. (గ్రుండ్‌రిస్సె, పరిచయం)

విడివిడిగా ఆయా సాహిత్య కృతులమీద మార్క్స్, ఎంగెల్స్‌లు చేసిన వ్యాఖ్యలలోని తాత్విక పార్శ్వం గురించి విపులీకరించే అవకాశం వుంది. అలా నిగ్గుతేలిన అంశాలు, మార్క్స్ అనుయాయులు కొందరు తాము ఘనంగా చేశామని చెప్పుకున్న వివరణాత్మ సాహిత్య విహారాల్ని సూర్యుడి ముందు దివిటీల్లా చేస్తాయి. మార్క్స్ రచనల్లో సర్వాతిశయంగా వున్న అంశం యేమిటి? జీవిత ప్రమాణాలు దిగజారిపోవడం పట్ల ఆగ్రహం, మానవజాతి శక్తిసామర్థ్యాలు వికసించకుండా విపరీతం చెయ్యడం పట్ల క్రోధం కనిపిస్తాయి (ముఖ్యంగా "ఎకనామిక్ అండ్ పొలిటికల్ మాన్యుస్క్రిప్ట్స్".) మన యుగంలో యితర తత్వశాస్త్రాల నుంచీ, చారిత్రక సిద్ధాంతాల నుంచీ మార్క్సిజాన్ని ప్రత్యేకించి నిలబెట్టేది యేది? ఆయన ఆగ్రహానికి సునిశిత అనురూపతనీ సందర్భాన్నీ కలిగించేవి యేమిటి? చాలకశక్తి, నిర్దేశకం అయిన అంశం, "అపరాయీకరణ" (1974లో మొరావస్కీ వాడిన పదబంధం) ఒక నైతిక సంభావ్యత అన్న దాని గురించి ఆయనకున్న స్పృహ, ఆచరణాత్మక మార్గ నిర్దేశకత అనేవే అవి.

వాస్తవికంకాని ఆదర్శ పార్శ్వాన్ని సవిమర్శక విశ్లేషణ వుండాల్సిన అనుభవపూర్వక సందర్భానికి అన్వయిస్తే ప్రమాదం ముంచుకొస్తుంది. ఏదో పోగొట్టుకున్నామన్న గుర్తింపు, అల్పిష్టితత్వం, అజ్ఞానం, అయోమయం, లుప్తత వున్నాయన్న యెరుక, దేన్ని గురించి వివరించడం జరుగుతోందో దాన్ని ముంచెత్తెయ్యవచ్చు. అయినా పద్ధతి రీత్యా చూసినపుడు ఒక వైఖరిని ఉపయోగించడం ఆమోదయోగ్యం కాదు. యీ వైఖరి ఆచరణ యోగ్యంగా భాసించవచ్చు. అదేమిటీ అంటే అస్తిత్వంలో వున్నదాన్ని, అందుబాటులో వున్నదే కాని లుప్తంగా వుంది అన్న ప్రస్తావన చేసేముందు ఒక మేరకే చెప్పడం. పరాయీకరణ చెందిందన్న దానిగురించిన భావన కలిగించకుండా అది అస్తిత్వంలో వున్న అంతరం గురించి ప్రస్తావించకుండా వుండే వైఖరి. సాహిత్యం, కళలు

సాధారణంగా అలా చెయ్యదగ్గ ఆదర్శరంగాలు. "సకల కళలకీ వున్న విమోచనాయుత, మానవీకరించే శక్తి" గురించి నొక్కిచెప్పినవాడు బా(హ్రో (1978). ఆయన యిటీవలి కాలంనాటి యితర విమర్శనాత్మక మార్క్సిస్టుల లాగా చెప్పాడు. యేమంటే కళాకారుడు, రచయిత పరాయీకరణ, అపరాయీకరణ సమస్యకు సహశోధకులు. సౌందర్యపర (సాహిత్యపర) విలువ, ప్రజారంగం మీద గుప్పించిన అపరాయీకరణ విలువ గుచ్ఛంలో అత్యంత స్ఫుటమైంది.

**చూడదగ్గ గ్రంథాలు:**


1. ల్యూకాక్స్, జార్జి 1964 "రియలిజం ఇన్ అవర్‌టైమ్, లిటరేచర్ అండ్ ద క్లాస్ స్ట్రగుల్".
2. ప్రాపర్ ఎస్.ఎస్, 1976. కారల్ మార్క్స్ అండ్ వరల్డ్ లిటరేచర్.
3. విల్లియమ్స్, రేమండ్ 1977, మార్క్సిజం అండ్ లిటరేచర్.


